# శాస్త్రదాస్యము

కొప్పరపు సుబ్బారావు



ది మోడరన్ పబ్లిషర్సు-తెనాలి.



వెల రు. 1-8-0

ప్రథమ ఆవృత్తి - మే 1944
ద్వితీయ ఆవృత్తి - జూన్ 1945

# నివేదన

తరతరముల నుండి
శాస్త్ర దాస్యము
చేయుచున్న దీన
హరిజనులవిమోచ
నకై, తమ తనూ
ధనప్రాణము లర్పిం
చుచున్న ఏ సంఘ
సంస్కర్తలుకలరో

వారి

పూజ్య పాదపద్మములకు

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.

# పరిచయం

గోపీచంద్

ఈ గ్రంథకర్త కొప్పరపు సుబ్బారావుగారు నాటక కర్తలుగా, మ్యాజిక్ డైరక్టరుగా ఆంధ్రలోకానికి చిరపరిచితులూ, ప్రఖ్యాతులునూ; కాని, వీరిశాస్త్రజ్ఞానం విమర్శనా పటిమా మాత్రం ఆంధ్రలోకానికి క్రొత్తే అనుకుంటాను.

నేనీ గ్రంథం చదవటం ప్రారంభించినప్పట్నించీ [illegible] నా మిత్రు- [illegible] ఆవేశం ఇన్నాళ్లూ ఏమయింది ఎట్లా ఇన్ని [illegible] ర్యపడ్డాను. ఈ గ్రంథంవల్ల [illegible] చేశారని నేను తలుస్తున్నాను. సహృదయంతో ఈ గ్రంథాన్ని చదివిన ప్రతి ఒక్కరూ నాతో ఏకీభవిస్తారని నా నమ్మకం. ధర్మాచరణ మానుకొని, ఇతరుల దాస్యం ప్రతిపాదించటమే అదర్శంగా పెట్టుకొని, చీటికీ మాటికి పూర్వధర్మాలను మంత్రాలవలె పునశ్చరణ చేస్తూ కూర్చునే ఆకారవాదులకు, శుష్కవాదప్రియులకు; బహు చక్కని జవాబు యుక్తియుక్తంగా చెప్పి, సుబ్బారావుగారు హిందూసంఘానికి అత్యంత మేలు చేశారని అంగీకరించక తప్పదు.

మానవ సంఘానికి స్థిరత్వం అనేది లేదు. ఆదికాలంనుంచీ పరిణామం పొందుతూనే వొచ్చింది. కల్పాంతంవరకూ పరిణామం చెందుతూనే వుంటుంది. అది నిత్య నూతనం. ధర్మశాస్త్రం అట్లా కాకపోవటంవల్ల ఒక కాలానికి ఉపయోగకరంగా వున్నది, మరొక కాలానికి నిరుపయోగంగానో, హానికరంగానో తయారవటం కద్దు. ఎప్పటికప్పుడు, సంఘంలో, మానవ ఆదర్శంలో, జరిగే ఈ మార్పునే అరవిందులు తమ గీతావాక్యంలో ఇట్లా చెప్పారు——

“మానవుడు ఆదిలో వ్యక్తిసుఖమే పరమావధిగా పెట్టుకున్నాడు. అందుకు అనుకూలమైన ధర్మాలు బయలుదేరినై. తరువాతి మెట్టు కుటుంబం. అప్పుడు కుటుంబంకోసం స్వసుఖాన్ని పరిత్యజించటం ప్రశంసనీయమైంది. తరువాతి మెట్టు వంశం. అప్పుడు వంశంకోసం స్వసుఖాన్నీ, కుటుంబశ్రేయస్సునీ కూడా లెక్కచెయ్యకపోవటం ప్రశంసనీయమైంది. తరువాతి మెట్టు జాతి. దాని తరువాత దేశం. దానితరువాత ప్రపంచం.”

ఒక మెట్టులోనుంచి రెండవమెట్టులోకి వొచ్చేటప్పుడు సంఘర్షణ, యుద్ధం, జననష్టం తప్పదు.

ఈ విధంగా మానవసంఘ పరిణామం జరిగేటప్పుడు ఒక దశకు ఉపయోగపడిన ధర్మాలు, మరొక దశకు పనికిరాకపోవటం సహజమే! ఇందులో ప్రకృతి విరుద్ధంగానీ, వైపరీత్యంగానీ ఏమీ లేదు.

నేడు మన పండితుల్లో ఎక్కువమంది ఈ సత్యాన్ని గ్రహించటంలేదు. ధర్మశాస్త్రాలూ, నీతిశాస్త్రాలూ ఎందుకు పుట్టినయ్యో, వాటి ప్రయోజనం ఏమిటో మరిచిపోయి తమ స్వార్థానికి పరపీడనకూ ఉపయోగిస్తున్నారు. శ్రీ వెన్నె సుబ్బారావుగారు ఈ గ్రంథంలో అలీకపాండిత్యం అని ఆత్మౌపమ్య రాహిత్యం అని ఉదహరించారు.

అసలు ధర్మం ఎందుకు పుట్టింది? సంఘకళ్యాణం కోసం గదా? నలుగురు కలిసి 'మనం కొన్ని ధర్మాలను పాటిస్తేనేగాని సుఖంగా, ఒడుదుడుకు లేకుండా బ్రతకలేం' అని నిర్ణయించుకొని తమ సుఖజీవనంకోసం ధర్మాలను ఏర్పరచుకుంటారు. సంఘం పరిణామంచెంది, ఈ ధర్మాలను ఏర్పరచుకున్న స్థితిని దాటినప్పుడు, ఈ ధర్మాలే—ఒకప్పుడు సంఘానికి శ్రేయస్సును కూర్చిన ఈ ధర్మాలే—అహితాన్ని కలుగజేస్తయ్. అంటే ఈ ధర్మాలన్నీ అధర్మాలౌతై అన్నమాట! అప్పుడు నూతనధర్మాల అవసరం సంఘానికి కలుగుతుంది.

ఇప్పుడు 'అబద్ధం ఆడగూడదు' అనే ధర్మం వుందనుకోండి. ఇదిచాలా మంచిధర్మం. సత్యంచెప్పటం చాలామంచిది. ప్రతివాడూ అబద్ధం ఆడుతూ వుంటే మానవుల్లో ఒకరిమీద ఒకరికి నమ్మకమే వుండదు. సుహృద్భావమే వుండదు. సుహృద్భావమే నశిస్తుంది. సంఘం అల్లకల్లోలమై పోతుంది. నిజమే! కాని సత్యంచెప్పటంవల్ల ఒక నిరపరాధికి అపకారంమాత్రమే జరిగేటట్టయితే మాత్రం అసత్యం చెప్పటమే మానవధర్మం అవుతుంది. ఇట్లాగే, అహింస పరమ ధర్మం. కాని ఒక దుర్మార్గుడు మనలను హింసించటానికి పూనుకున్నప్పుడు మాత్రం సామదానభేదదండోపాయాల్తో, మనలను కాపాడుకోటమే పరమ ధర్మం. "సముచితహింసన మరయ నహింస" అనికూడా భారతం చెపుతూ వుంది. ఇంతేకాదు. "పరహితము సేయబూనిన పురుషుడు, పాపంబుసేసి పొందడు కీడు" అనికూడా చెపుతూవుంది.

ఈ అపవాదాలనుబట్టి, ధర్మశాస్త్రాలు సంఘక్షేమంకోసం ఏర్పడ్డవిగాని, పీడనకోసం కాదని మనకు సుబోధంగా గ్రాహ్యమౌతూంది. మనం ధర్మశాస్త్రాల కోసం పుట్టలేదు. మనకోసం ధర్మశాస్త్రాలు పుట్టినై. ధర్మానికి దానంతటదానికి విలువలేదు—ఫలితాన్నిబట్టి కలుగుతుంది. ఈ సంగతే ఈ గ్రంథంలో సుబ్బారావుగారు, మిక్కిలి ప్రతిభావంతంగా వ్రాశారు. ఇదెవ్వరూ—సంఘక్షేమం కోరేవారు—కాదనలేనిధర్మం. ఈ ధర్మానికి అపవాదంకూడా లేదు.

"ముందు ఆకలి, తర్వాతే ధర్మం" అంటున్నారు సుబ్బారావుగారు. ఇది మహావాక్యం. మానవుడు కొన్నాళ్ళు జీవించి వుంటేనే ఏదైనా. జీవించటం

ముఖ్యం. దీనికి మించిన ధర్మంలేదు. విశ్వామిత్రమహర్షి కరువులో తిండి దొరక్క మాలపల్లిలో కుక్కమాంసం దొంగిలించి, తిని, జీవించాడు. ఇది అధర్మంకాదా అని ప్రశ్నించిన మాలవానికి "జీవితం మరణాచ్ఛ్రేయో జీవన్ధర్మమవాప్నుయాత్" అని జవాబుచెప్పాడు. 'మరణించటంకంటే జీవించటం మేలు. జీవించివుంటే ధర్మం చెయ్యగలంగాని మరణించి చేసేదేముంది?' అని.

ఇందులో తప్పులేదు —"ప్రాణరక్షణం పరమధర్మం." కనుక 'ముందు మానవులు సలక్షణంగా జీవించే ఏర్పాటు చెయ్యండి. తర్వాత జీవించి ఏంచెయ్యాలో, దేన్ని సాధించాలో చెప్పండి' అంటున్నారు సుబ్బారావు గారు. ఆర్థిక సమానత్వం ముందు, ఆధ్యాత్మికచింత తర్వాత. అంతేగాని శాస్త్రాలవంకతో మొదలుకే మోసంతేకండి! ఈఅభిప్రాయంతోనే వివేకానంద స్వాములుకూడా, "నాదేశంలో ఆకలితో మాలిగే ఒక కుక్కవున్నా, దాని కడుపుచిచ్చు చల్లార్చటమే నామతం," అన్నారు. ఇది గ్రహించక, సంఘానికి ఆర్థికసౌష్ఠవం ఏర్పడకముందే, ప్రజలందరికీ ఆహారందొరికే సదుపాయం కలగక ముందే, ఆధ్యాత్మికచింతలో పడటంవల్లే మన దేశానికి ఈ దుర్గతి పట్టిందని నా విశ్వాసం.

ఈ గ్రంథంలో సుబ్బారావుగారు, సాంఘిక ఆర్థికదృష్టి లోపించటం వల్ల వొచ్చే శాస్త్రదాస్యాన్ని, దానివల్ల కలిగే అగచాట్లనూ, కన్నులకు కట్టినట్లు వర్ణించారు. దీనివల్ల శాస్త్రదాస్యాన్ని ప్రచారంచేసే వారిలో ఏకొద్దిమందికైనా అనుభవించేవారిలో ఏకొద్దిమందికైనా కనువిప్పు కలిగితే వారు కృతార్థులైనట్లే.

వారు చెప్పినట్లు ఈ గ్రంథం వ్రాయటానికి కారణం పెద్దలను తిరస్కరించటంకాదు. పండితులను దూషించటమూకాదు. సంఘశ్రేయస్సు మాత్రమే...

సంఘహితమే ఆదర్శంగా పెట్టుకున్న ఈ గ్రంథం ఉత్తమగ్రంథం—ప్రజల ఆదరాభిమానాలను తప్పక చూరగొంటుంది. వివిధ శాస్త్రాలలోడనంచేసి ధర్మాధర్మాలు కుశలాకుశలాలనుబట్టి నిర్ణయింపబడతవని, నిరూపించిన సుబ్బారావుగారు ధన్యులు.

శాస్త్రదాస్యం ఆంధ్రదేశాన్నేకాక యావద్భారతదేశాన్ని పీడిస్తున్న జాడ్యం అవటంవల్ల, ఈ గ్రంథం త్వరలో ఇతర భాషల్లోకి తర్జుమాకాగలదని ఆశిస్తున్నాను. సంఘ సంస్కర్తలు ఇందుకు పూనుకోవాలని నామనవి. ఇంతకంటే నేను ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదు. ఇప్పటికే కాలాతీతమైంది.

మన్యాయవాదా ఇంటింటా వినాలని నేను చాలా కుతూహలంతో వుండి [illegible] చేస్తున్నారు. ఆ పని సుబ్బారావుగారు ప్రవేశిస్తున్నారు.

సూతాశ్రమం,
తెనాలి.

గోపీచంద్

## ఒక్కమాట

కొన్నాళ్ళక్రితం — ఈ శాస్త్రదాస్యంలోని కొన్నికొన్ని ఊహల్ని అస్పష్టంగా ఆరోగ్యకరంగా మన పత్రికల్లో ప్రచురిస్తూవచ్చాను. ఆ ప్రచురణాలు పరిశీలించినవారిలో మన సనాతన — అధునాతనుల్లో, అవి తీవ్రవాదప్రతివాదాలను రేకెత్తించినట్టు నిరూపించగా, వారివారి దూషణ భూషణ ఖండన మండనాల్లో పండిన లేఖలు, కొన్నాళ్ళపాటు ఈ రచయితను గుక్కతిప్పుకో నివ్వకుండా చేశాయ్. ఆ వాయువ్యయాలు అంచనావేసి చూస్తే, దీవనలన్నీ ఖర్చయిపోయి తిట్లు మిగిలిన తేలినయ్. మరి, నిండా మునిగితే చలేవుండదు కాబట్టి ఈ 'శాస్త్రదాస్యాన్ని' సంపూర్ణంగా ఈనాడు ఆంధ్రలోకానికి అందిస్తున్నాను.

నేను కోరినవెంటనే దీనికి విపులమైన పీఠిక వ్రాసియిచ్చిన గోపీచందు గారికి చాలా కృతజ్ఞుణ్ణి. ఈ గ్రంధరచనకు నన్ను ప్రేరేపించిన ఉద్దేశాలను గూర్చి, వారే తమ అమృతలేఖినితో వివరించారు. కాబట్టి నేను ఏమిచెప్పినా ఇక చర్విత చర్వణమే.

ఈ గ్రంథాన్ని వాడుకభాషలో వ్రాయాలని అనుకున్నాను: పొసగలేదు. ఎందుకంటే గ్రంథవస్తువు శాస్త్రచర్చ—శాస్త్రచర్చ చేసేటప్పుడు భాష కూడా కొంచెం మడికట్టుకుంటే బాగుంటుందని తోచింది. కాబట్టి గ్రామ్యేతర శైలిలోనే వ్రాశాను. ఇదీ శాస్త్రదాస్యమే! మరి— అనివార్యంఅయింది!

ఈ గ్రంథంలో కొన్నికొన్ని పారిభాషిక పదాలకీ శ్లోకాలకీ వరస అంకెలు వేసి, వాటిని గ్రంథాంతంలో 'టీక' అనే శీర్షికక్రింద వివరించాను. జిజ్ఞాసువులకు ఇది సహాయపడగలదని ఆశయం.

కొప్పరపు సుబ్బారావు

# ద్వితీయ ఆవృత్తి

ఈ 'శాస్త్రదాస్యం' ప్రథమావృత్తి ప్రతులన్నీ, ముద్రించిన కొలది కాలంలోనే ఖర్చయిపోయినయ్. ఇంత అచిరకాలంలో, దీని ద్వితీయావృత్తికి అవకాశం కలిగించిన ఆంధ్ర మహాజనుల ఆదర సత్కారాలకు ధన్యవాదాలు.

16-6-45 కొప్పరపు సుబ్బారావు.

# సాంకేతికములు

ఆ. గృ. — ఆపస్తంబ గృహ్యసూత్రములు
ఋగ్వే. — ఋగ్వేదము
ఐ. బ్రా. — ఐతరేయబ్రాహ్మణము
గీత. — భగవద్గీత.
గీ. భా. — గీతాభాష్యము (శాంకరము)
చ. వి. — చతుర్వింశతిమతము
చాటు. — చాటుపులు
జాబా. — జాబాలోపనిషత్తు
తై. ఆ. — తైత్తిరీయారణ్యకము
తై. ఉ. — తైత్తిరీయోపనిషత్తు
దివో. — దివోదాసీయము
నిర్ణ — నిర్ణయసింధువు
ప. మా. — పరాశరమాధవీయము
ప. స్మృ. — పరాశరస్మృతి
బోధా. — బోధాయన ధర్మసూత్రములు
భాగ. — భాగవతము
మను. — మనుస్మృతి
మ. భా. — మహాభారతము
మార్క. — మార్కండేయపురాణము
మితా. — మితాక్షరి
యాజ్ఞ. — యాజ్ఞవల్క్యస్మృతి
వాయు. — వాయుపురాణము
విష్ణు. — విష్ణుపురాణము
శత. — శతపథబ్రాహ్మణము
సూత. — సూతసంహిత
స్కాంద. — స్కాందపురాణము
స్మృ. చం. — స్మృతిచంద్రిక
స్మృ. ము. — స్మృతిముక్తాఫలము
స్మృ. ర. — స్మృతిరత్నాకరము
హేమా. — హేమాద్రి ప్రాయశ్చిత్తకాండము

# శీర్షికల సూచిక

## ఖండనాధ్యాయము



## మండనాధ్యాయము

# ఖండనాధ్యాయము

## 1. దాసోఽహం

నేనొక హిందువుడను: కాని, కడజాతియని మీచే నిర్వచింపబడిన 'అంటరాని' కులములో జన్మమెత్తి యున్నాను. మీ గ్రామమునకు వెలుపల నాయిల్లు—మీ వీధికి వెలుపల నా పర్యటనము — మీ సంఘమునకు వెలుపల నా స్థానము. నా జీవితపరిస్థితుల వైపరీత్యము నిజముగా మేర నతిక్రమించినది. దేశవ్యవహారముల వంక జూతునా అవి నా యధీనమున లేవు—ఖండాంతరవాసుల నిగ్రహానుగ్రహములు వానిని శాసించుచున్నవి. నా తెక్కలకష్టమును జూచుకొని తృప్తివహించుదునా ఆ కష్టమునకు ఉచితఫలము నా యధీనమున లేదు — కలవారి ఆర్థిక సిద్ధాంతముచే అది శాసింపబడుచున్నది. పోనిండు. నా హిందూసంఘములో నాకోరిన స్థానమునకైన యత్నించి చూతునా, ఆ సంఘధర్మము నా యధీనమున లేదు. అది శాస్త్రముల యధీనము. ఆ శాస్త్రములు పండితాధీనములు. ఆ పండితులు పెక్కురు కేవల పాండిత్యదృష్టికి అధీనులు—కొందరు స్వాధికారస్థాపనా వేశమునకు అధీనులు—కొందరు సత్యగోపన వ్యసనమునకు అధీనులు. తమ పాండిత్యమును సంఘకళ్యాణమునకై వినియోగించుచున్న ఉదారస్వభావులు — అల్పసంఖ్యాకులు—అచ్చటచ్చట లేకపోలేరు. వారికి మా కైవారములు.

## 2. చక్రము - ఈగ

ఈ రాజకీయ ఆర్థిక సాంఘిక ధర్మములు మూడును మూడు చక్రములవలె పరిభ్రమించుచున్నవి. ఆ పరిభ్రమణము

మీాద నా అధికార మేమియు లేదు. తరతరములాదిగా అవి తమంత తాము తమ ఇచ్ఛవచ్చిన గతిభేదములతో అట్లే పరి భ్రమించుచున్నవి. వానిపై వ్రాలిన ఒక ఈగనువలె అవి నన్ను తమతోపాటు త్రిప్పుకొనిపోవుచున్నవి. నామీాద అధికారము గల ఒక ముగ్గురుమూర్తులు ఆకాశములో నున్నారట! వారి యునికి సత్యమో అసత్యమో కాని మరొక ముగ్గురు దేవులు ఇహలోకములో నాకు అనుక్షణము ప్రత్యక్షదర్శన మిచ్చు చున్నారు. నా రాజకీయ దేవత, ఖడ్గసంపన్నుడైన ఖండాంతర వాసి. నా ఆర్థిక దేవత, లక్ష్మీసంపన్నుడైన భూస్వామి. నా సాంఘిక దేవత, శాస్త్రసంపన్నుడైన వైదికశిఖామణి. ఒక టవ రెండవ దేవతలను ఎట్లో ప్రసన్నమొనర్చుకొనగలనను ధైర్యము నాకు కలిగినది. మూడవ దేవతయెడల మాత్రము అట్టిధైర్యము బొత్తుగా కలుగుటలేదు. కారణము—బలాంధుల కన్న ధనాంధులకన్న మతాంధులు బహుకఠినులు-కసాయీలు!

## 3. సంస్కర్తలు-సనాతనులు

'హరిజనులకు స్పృశ్యత' 'హరిజనులకు సంఘసభ్యత్వము' 'హరిజనులకు దేవాలయప్రవేశము' అను నవజీవనాశయములతో ప్రచారము సేయ సాహసించుచున్న నేటి మన సంఘసంస్కర్త లను, ఈ పండితుల శాస్త్రవాదము—అవధానమందు నిషేధాక్షరి వలె—అడుగడుగునకు నిలువరించుచున్నది. ఒక్క హరిజన సంస్కర్తలనేకాదు—అనేకముఖముల బారలుసాచ యత్నించు చున్న మన సంఘ సంస్కరణోద్యమము నంతటిని ఈ శాస్త్ర వాదము ఎచ్చటికచ్చట ప్రతిఘటించి నిరోధించుచున్నది. ఈ పండితులు నేడు 'వర్ణాశ్రమ స్వరాజ్యసంఘము' లనియు 'సనాతన ధర్మరక్షకసభ' లనియు 'వైదిధర్మస్థాపనపరిషత్తు'

లనియు విధవిధములైన సంస్థలను నెలకొల్పి తీవ్రప్రచారము సేయుచున్నారు. ఏమని? 'అంటరానితనము వైదికధర్మ సమ్మతము' 'వర్ణవిభేదనిర్మూలనము సనాతనధర్మ విరుద్ధము' 'ప్రౌఢ వివాహములు ఆర్యధర్మవ్యతిరిక్తములు' 'విధవా వివాహము లకు శాస్త్రాధికారము లేదు' అని. వీరి వాదమంతయు దేనిపై ఆధారపడి యున్నది? శాస్త్రములపై. శాస్త్రవాదమునేగాని హేతువాదమును వీ రంగీకరింపరా? శాస్త్రవాదమునకు అడ్డు రాని యెడల హేతువాదమును వీ రంగీకరింపవచ్చును. అడ్డు వచ్చునెడల అంగీకరింపరు. వీరికి శాస్త్రవాదము ప్రధానము; హేతువాద మప్రధానము. ఈ విషయమున మన నీతిశాస్త్ర కారులు వారిపక్షమే పలుకుచున్నారు.

1. అర్థశాస్త్రాత్తుబలవత్ ధర్మశాస్త్ర మితిస్థితిః—యాజ్ఞ.

కాబట్టి శాస్త్రవిచారమే మనకు ప్రధాన కర్తవ్యము. హేతు వాద మనంతరము.

## 4. నిజము-నిష్ఠురము

ఈ వ్యాసోద్దేశ్యమును సులభముగా సాధించుటకై ప్రశ్నోత్తరపద్ధతిని అవలంబించితిని. కాని పృచ్ఛకుడు నిజముగా హరిజనుడు కాడు: పృచ్ఛితుడు నిజముగా బ్రాహ్మణుడును గాడు. ఇర్వురును ఊహాప్రపంచములోని వ్యక్తులే. అయినప్పటి కిని ఈ వ్యాస విషయిక చర్చా సందర్భములో అందునందు కొందరను గూర్చి నిష్ఠురముగా వ్రాసె ననునిందకు ఈ వ్యాస కర్త గురికావచ్చును. నిజమాడుట నిష్ఠురమే! మరి—అబద్ధ మాడుట ఆత్మవంచనము.

## 5. ధర్మశాస్త్రములు

మనమిపుడు దేనినిగూర్చి విచారింపవలసియున్నది? సనాతనధర్మము—అనగా, వేదసమ్మతమైన ధర్మము — అనగా, వైదికధర్మమును గూర్చి. ఆ వైదికధర్మమునుగూర్చి తెలుసుకొనుటకు మన మే గ్రంథమును చదువవలెను? ఒకటికాదు— ఒక వేయి గ్రంథములు చదువవలెను—శ్రుతులు[1] స్మృతులు[2] ఇతిహాసములు[3] పురాణములు[4] వేయునేల? ప్రాచీన వాఙ్మయము నంతయు తిరుగవేయవలసి యుందుము.

## 6. ధర్మనిర్ణయము

ఇన్ని వందల గ్రంథములనుండి ఏదేని యొకానొక ధర్మమును నిర్ణయించుటెట్లు? మనువు చెప్పుచున్నాడు—

2. ప్రత్యక్షం చానుమానంచ శాస్త్రంచ వివిధాగమమ్
త్రయం సువిదితం కార్యమ్ ధర్మసిద్ధి మభీప్సతామ్॥

3. ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా
యస్తర్కేణానుసంధత్తే స ధర్మమ్వేద నేతరః॥ (మను)

అనగా, ఋషిప్రోక్తమై ధర్మోపదిష్టమై వేదశాస్త్రసమ్మతమై ఏది ప్రత్యక్షానుమానములనంబడు తార్కిక సాధనములకు లభ్యమగుచున్నదో అదియే ధర్మము; ఇతరము కాదు. దీనివలన రెండు ముఖ్యవిషయములు తేటపడుచున్నవి. ఒకటి-ధర్మము వేదశాస్త్రములవలన విజ్ఞేయమనియును; రెండు- అది ఆ వేద శాస్త్రముల నుండి తర్క్య (సాధ్య) మనియును. అట్లైన మనమా తర్కమునకు ఇపుడు పూనుకొనవలసి యుందుమా? లేదు. ఆ పనినిగూడ మన పూర్వులే మనకొరకు చేసిపెట్టినారు. వారే తర్కించి తమ నిర్ణయములను ఆ శ్రుతి స్మృత్యాదుల యందే ప్రతిపాదించి యున్నారు.

## 7. తరతమములు

ఆ శ్రుతిస్మృతిపురాణాదులకు గూడ మన పెద్దలు తరతమప్రామాణ్యమును విధించియున్నారు.

4. ధర్మం జిజ్ఞాసమానానామ్ ప్రమాణం పరమం శ్రుతిః
ద్వితీయం ధర్మశాస్త్రంతు తృతీయం లోకసంగ్రహః-(మను)

అనగా, ధర్మనిర్ణయమునకు శ్రుతులు ఉత్తమ ప్రమాణములు; ధర్మశాస్త్రములు మధ్యమ ప్రమాణములు; లోకసంగ్రహము (లోకాచారము) కనిష్ఠప్రమాణము. కావున, సనాతన ధర్మవిచారముసేయ నుద్యమించువారు ఈ మూడింటిని ఆయా తరతమప్రామాణ్యమునుబట్టి పరామర్శింపవలసియుండును.

## 8. సనాతనధర్మరక్షణము

శ్రీశంకరభగవత్పాదులు తమ గీతాభాష్య (ఉపోద్ఘాత) మునందు సెలవిచ్చుచున్నారు—

ఈ శంకరులవారు అసాధారణ మేధావంతులు, వైదిక ధర్మ పునరుత్థాపన మహాచార్యులు. వీరు — "వేదములందు బ్రహ్మతో, తదంగములందు గర్గునితో, తదర్థవివేచనమునందు శుక్రునితో, తత్కర్మనిరూపణమునందు జైమినితో, తత్సూత్ర వివరణమునందు వ్యాసునితో సమాను"లట.

5. వేదే బ్రహ్మసమ, స్తదంగనిచయే గర్గోపమ, స్తత్కథా
తాత్పర్యార్థవివేచనే గురుసమ స్తత్కర్మ సంకీర్తనే
ఆసీజ్జైమినిరేవ, సూత్రనిచయస్యార్థోపసంవర్ణనే
వ్యాసేనైవసమ, స్సశంకరగురుర్జేజీయతాం మానసే॥ (చాటు)

అట్టి శంకరులవారు వైదికధర్మరక్షణమునుగూర్చి ఏమని సెలవిచ్చుచున్నారు? వినండి—

6. బ్రాహ్మణత్వస్యహి రక్షణే రక్షితస్స్యాత్ వైదికోధర్మః
తదధీనత్వాత్ వర్ణాశ్రమ భేదానామ్॥ (గీ. భా.)

కాబట్టి వర్ణాశ్రమవ్యవస్థ అంతయు బ్రాహ్మణత్వముమీదనే ఆధారపడియున్నది. ఆ బ్రాహ్మణత్వ మెంతకాలము సురక్షితమై యుండునో, అంతకాలము సనాతనధర్మమునకు పతనము కలుగదు. ఏనాడు బ్రాహ్మణత్వ మపభ్రంశమునొంది యధోగతమగునో ఆనాడు సనాతన వైదికధర్మము నశించినదేయగును. కావున సనాతనధర్మ మంతటికిని బ్రాహ్మణత్వమే ప్రాణమనుట స్పష్టము.

## 9. నేడు

కాబట్టి, ఈ సనాతనధర్మస్వరూప మెట్టిదో తెలిసికొనుటకు, సనాతనబ్రాహ్మణత్వమెట్టిదో తెలిసికొనక తప్పదు. ఆ సనాతనబ్రాహ్మణత్వప్రమాణముతో అధునాతనబ్రాహ్మణత్వమును పరీక్షింపక తప్పదు. అస్పృశ్యతా విచారమునకు ఇన్నిగాథలేల? ఇన్ని తర్కములేల? అను ప్రశ్న రావచ్చును. ఆ ప్రశ్నకు "సనాతన ధర్మోద్ధారకు"లే సమాధాన మీయవలెను. ఏలయన, అస్పృశ్యతానివారణ ప్రతిఘటనము కొరకు శాస్త్రములను బయటకులాగినది వారేకదా? కాన, ఇక నిపుడు బ్రాహ్మణత్వవిచారము.

## 10. బ్రాహ్మణుడు

వర్ణములు మనుష్యకల్పితములు కావట. శ్రీకృష్ణుడు స్వయముగ నిర్వచించుచున్నాడు—

7. చాతుర్వర్ణ్యమ్ మయాసృష్టమ్ గుణకర్మవిభాగశః- (గీతా)

అందు, బ్రాహ్మణవర్ణము బ్రహ్మముఖమునుండి యుత్పన్న మైనదట.

8. బ్రాహ్మణోస్య ముఖమాసీత్ — (ఋగ్వే)

## 11. బ్రాహ్మణత్వము

సృష్ట్యాది నేటివరకు ఈ ప్రపంచమున నెన్నియో జాతులు ఎన్నియో మతములు పుట్టినవి—గిట్టినవి. కాని ఈ భారతఖండమున దక్క ఏ యితరఖండమునందైన ఏ మతమునందైన ఏ సంఘమునందైన ఇట్టి బ్రాహ్మణత్వము— ఇట్టి విసూత్న వర్ణ సృష్టి— కలదా? లోకైక నిరుపమానమైన ఇట్టి బ్రాహ్మణత్వమును కాపాడి తన్మూలమున సనాతనధర్మమును సురక్షితము సేయుటకై మన మహర్షులు ఎట్టి కఠిన నియమములను ఎట్టి కఠోరశాసనములను విధించియుండిరో వినుడు!

## 12. బ్రాహ్మణుని విధులు

బ్రాహ్మణుడు అహరహము సంధ్య నుపాసింపవలెనట. ఆజన్మాంతము అగ్నిహోత్రము నాచరింపవలెనట.

9. అహరహస్సంధ్యాముపాసీత- (అప)

10. యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్- (తై. ఆ)

11. ఔపాసన పరిత్యాగీ సురాపీ త్యుచ్యతే బుధైః- (హేమా)

సంధ్యకొరకు బ్రాహ్మణుడు శుచి అశుచి అను భేదమునుకూడ పాటింపనక్కరలేదట.

12. శుచిర్వా ప్యశుచిర్వాపి
కాలే సంధ్యాం సమాచరేత్ — (హేమా)

"కలౌ పారాశరాః స్మృతాః"[5] అను న్యాయము చొప్పున మీకు ప్రమాణాగ్రగణ్యమైన పరాశరస్మృతి యేమి చెప్పు

చున్నదో వినుడు.

13. నోపతిష్ఠేత యః పూర్వాం నోపాస్తే యశ్చ పశ్చిమామ్
స శూద్రవత్ బహిష్కార్యః సర్వస్మాత్ ద్విజకర్మణః॥

14. అగ్నికార్యపరిభ్రష్టాః సంధ్యోపాసన వర్జితాః
వేదంచయేఽనధీయానాస్తే సర్వే వృషలాః స్మృతాః-(ప. స్మృ)

అనగా, "సంధ్య నుపాసింపనివారును, వేదములు పఠింపనివారును, అగ్నికార్యములు (దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయములు) సేయనివారును, శూద్రులతో సమానులు. అట్టివారిని శూద్రులనువలె బహిష్కరింపవలెను." — అట్లు బహిష్కరింపబడుటకు ఇచ్ఛగింపని వారికి మన శాస్త్రములు విధవిధములైన ప్రాయశ్చిత్తములను శాసించుచున్నవి. వ్యాస మహర్షులవారు సెలవిచ్చుచున్నారు—

15. సంధ్యాదికర్మలోపేషు ప్రాయశ్చిత్తమభోజనమ్
దినద్వయే త్రిరాత్రం స్యాత్ కృచ్ఛ్రార్ధంతు దినత్రయే॥

16. దశాహే కృచ్ఛ్రమేకంస్యాత్ ఊర్ధ్వంచాంద్రాయణంభవేత్
చాంద్రాయణం పరాకంచ మాసా దూర్ధ్వం విధీయతే॥

17. తతోఽప్యేవం ప్రకల్ప్యం స్యాత్ వ్యాసస్యవచనం తథా-(స్మృ. ము)

అనగా, ఒక దినము సంధ్యవార్చని బ్రాహ్మణునకు అభోజనము[6] ప్రాయశ్చిత్తము. రెండుదినములు సంధ్య నుపాసింపనివానికి మూడురాత్రులు అభోజనము ప్రాయశ్చిత్తము. మూడుదినము లుపాసింపనివానికి సగము కృచ్ఛ్రము[7] ప్రాయశ్చిత్తము. పది దినము లుపాసింపనివానికి ఒక నిండుకృచ్ఛ్రము ప్రాయశ్చిత్తము. పదిదినములు మించినవానికి చాంద్రాయణము[8] ప్రాయశ్చిత్తము. నెలదినములు సంధ్యవార్చని బ్రాహ్మణుడు చాంద్రాయణముతోపాటు పరాక[9] మనంబడు మరొక ప్రాయశ్చిత్తమును

గూడ ఆచరింపవలెను. ఇంతేకాదు—సంధ్యాగ్నులను విడిచిన నామమాత్ర బ్రాహ్మణులకు ఎందరు మహర్షులు ఇంకను ఎట్టి కఠిన నియమములను విధించుచున్నారో వినుడు.

18. యో సపవిధ్యేత్ స కృచ్ఛ్రమ్ ద్వాదశ రాత్రం చరిత్వా
పునరాధేయం కారయేత్ —(వసిష్ఠేన-స్మృతిరత్నాకరే)

19. అగ్న్యుత్సాదీ సంవత్సరమ్ ప్రాజాపత్యం చరేత్
గాంచ దద్యాత్ — (శంకేన—తత్రైవ)

20. ద్వాదశాహాతిక్రమే త్ర్యహ ముపవాసో
మాసాతిక్రమే ద్వాదశాహ ముపవాసః—
సంవత్సరాతిక్రమే మాసోపవాసః
పయో భక్షణంచ— (భరద్వాజేన-తత్రైవ)

21. సంవత్సరోత్సన్నేగ్నిహోత్రే చాంద్రాయణంకృత్వా
పున రాదధ్యాత్ —
ద్వివర్షోత్సన్నే చాంద్రాయణం సోమాయనంచ కుర్యాత్
త్రివర్షోత్సన్నే కృచ్ఛ్రమభ్యస్య పునరాదధ్యాత్ —
(హారితేన-తత్రైవ)

22. సంధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హః సర్వకర్మసు
యత్కించిత్ కురుతేకర్మనతస్యఫలభాగ్ భవేత్ - (మితా)

23. నోపతిష్ఠంతి యే సంధ్యామ్ స్వస్థావస్థాసు వైద్విజాః
హింసంతిహి సతా దేవం భగవంతం దివాకరమ్ (పా—మా)

"వర్ణాశ్రమ" వాదులారా! "సనాతన ధర్మోద్ధార"కులారా! ఇన్ని ప్రమాణముల నిచ్చుట మేమేల సంగ్రహించితి మనగా, సనాతన వైదికధర్మమునకు బ్రాణసమానములైన ఈ సంధ్యాది విధులపట్ల మీ రెంతవరకు జాగరూకులైయున్నారో పరిశీలించుటకే! ఈ పరిశీలన మిక్కిలి సులభము. ఏలయన పాశ్చాత్య విద్యాలయములందు జదువుచున్న వేలకొలది బ్రాహ్మణయువకులు లేరా? సర్కారువారి కార్యాలయములందును ఇతర

కార్యాలయములందును పనిచేయుచున్న వేలకొలది బ్రాహ్మణ గృహస్థులు లేరా? ఈ విద్యార్థులలో ఈ గృహస్థులలో నూటికి తొంబదుగురకు సంధ్యాజ్ఞాపకమే లేదు. జ్ఞాపకమున్న ఆ పదుగురలో నిద్దరైనా యథావిధముగా నుపాసింపరు. ఇక, అగ్నికార్యములు నూటికి నూరు పూర్ణానుస్వారములు. మరి, మీ శాస్త్రవాక్యము ప్రకారము ఈ వేలకొలది బ్రాహ్మణులనెల్ల మీరు బహిష్కరింపవలదా? ఏల బహిష్కరించుటలేదు? సంధ్యాగ్నులు విసర్జించిన బ్రాహ్మణుడు సర్వకర్మలకు ననర్హుడు కదా! దానిచే మీరు కర్మలెట్లు చేయించుచున్నారు? సంవత్సరముల తరబడి సంధ్యాగ్నులులేమి, కృచ్ఛ్ర చాంద్రాయణ పరాకాది వివిధ ప్రాయశ్చిత్తములకు గూడ నతీతులైన యీ వేలకొలది బ్రాహ్మణులను ఏల వెలిపెట్టలేదు? ఇందరిని వెలిబెట్టుటకు మీకు ధైర్యసాహసములు కలవా? కలిగినను సాధ్యమా?— పోనిండు. "ఇతరుల కర్మాచరణమునకు మేము బాధ్యులము కాము. మేముమాత్రము స్వయముగా అన్నిధర్మములను అన్ని కర్మములను యథావిధిగా నాచరించు చున్నాము" అని మీ 'వర్ణాశ్రమోద్ధారకు' లందురు కాబోలు. మంచిదే. కాబట్టి, మీ ధర్మాచరణవైఖరిని గూడ యొక్కింత పరీక్షింతము. మీకు శ్రీకృష్ణభగవానుడు ఏమి విధించుచున్నాడో వినండి!

24. శమోదమ స్తపశ్శౌచమ్ క్షాంతిరార్జవమేవచ
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యమ్ బ్రాహ్మం కర్మ స్వభావజమ్-(గీతా)

శమము అనగా అంతరింద్రియ నిగ్రహము, దమము అనగా బహిరింద్రియ నిగ్రహము, తపము, శౌచము అనగా శుచిత్వము, క్షాంతి అనగా (మానసికమైన) ఓర్పు, ఆర్జవము అనగా సరళవర్తనము, జ్ఞానము అనగా మోక్షసాధనమైన బుద్ధి, విజ్ఞాన

మనగా శాస్త్రాదులయందు పరిజ్ఞానము, ఆస్తిక్యము అనగా దేవుని యునికియందు విశ్వాసము—ఈ తొమ్మిదియు బ్రాహ్మణునకు స్వభావసిద్ధములైన లక్షణములు. ఇక మనువు ఏమి శాసించుచున్నాడో వినండి !

25. అధ్యాపనం చాధ్యయనమ్ యజనం యాజనం తథా
దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానా మకల్పయత్-(మను)

అధ్యాపనము అనగా వేదాధ్యయనము చేయించుట, అధ్యయనము అనగా వేదములను స్వయముగా నభ్యసించుట, యజనము అనగా యాగములు స్వయముగాచేయుట, యాజనము అనగా ఇతరులచే యాగములు చేయించుట, దానము అనగా పరులకు (అయాచితముగా) దానముచేయుట, ప్రతిగ్రహము అనగా పరులవలన (అయాచితముగా) దానము గైకొనుట—ఈ యారును బ్రాహ్మణునకు సనాతనధర్మ విహితమైన కర్మలు. ఇక, శ్రుతులేమని శాసించుచున్నవో వినండి !

26. బ్రహ్మచర్యం పరిసమాప్య గృహీభవేత్, గృహీభూత్వా
వనీభవేత్, వనీభూత్వా ప్రవ్రజేత్— (జాబా)

అనగా మొదట బ్రహ్మచర్యము, పిదప గార్హస్థ్యము, పిమ్మట వానప్రస్థము, అనంతరము సన్యాసము, ఈ నాల్గును బ్రాహ్మణునకు సనాతనధర్మవిహితమైన ఆశ్రమములు. మరి, పండితులారా! అస్పృశ్యతానివారణమును ప్రతిఘటించుటకు నడుములు బిగించిన యో "వర్ణాశ్రమ"వాదులారా! శాస్త్రములందలి ప్రత్యక్షరమును పొల్లులుసహా మన కనుల్లంఘనీయములని వాదించుచున్న యో "సనాతనధర్మోద్ధార"కులారా! చేతులు జోడించి యడుగుచున్నాము — మీలో నేడెందరు తపస్సంపన్నులున్నారు ? మీలోనేడు నూటికి పదుగురైన యాజకాధ్యాపకులున్నారా ? మీలో నేడు నూటికి ఐదుగురైన యజనాధ్యయన

నైష్ఠికులున్నారా? మఱొక ముఖ్యవిషయము—మీలో శాస్త్రీయ మైన బ్రహ్మచర్యాశ్రమమును ఎందరు పరిపాలించుచున్నారు? ఎందరు వేదవిహితమైన గృహస్థాశ్రమమునం దున్నారు? గృహస్థాశ్రమానంతరమున నెందరు అడవులు పట్టినారు? అడవులుపట్టిన పిదప నెందరు సన్న్యసించినారు? నాయనలారా! వానప్రస్థాశ్రమస్వీకారమును మీరేల చేయుటలేదు? అది కడుంగడు సులభమేకదా! మనదేశమున అడవులకు కరవు వచ్చెనా? నల్లమల ఎఱ్ఱమల వింధ్య మొదలగు మహారణ్యములు మనకు దగ్గరనే యున్నవి కదా? మీ కొఱకే కాబోలు మన సర్కారువారు ఆ యడవులను ప్రత్యేకచట్టములద్వారా జాగ్రత (రిజర్వుడు) చేసిపెట్టినారే! ఆ యడవులలోనికి చక్కని రైలుమార్గములు కూడ నున్నవే! అయ్యలార! మేము హాస్యమునకు అనుగుట లేదు—త్రికరణశుద్ధిగా, ఏకాగ్రచిత్తముతో ప్రశ్నించుచున్నాము. ఏ సనాతనధర్మము హరిజనులకు అస్పృశ్యతను విధించుచున్నదని మీరు ఘోషించుచున్నారో, ఆ సనాతనధర్మమే మీకు బ్రహ్మచర్యాది చతురాశ్రమములను యజనాది షట్కర్మలను శమదమాది నవవిధసాత్త్విక లక్షణములను విధించుచుండగా మీ రేల ఆ ధర్మశాసనములను ఉల్లంఘించుచున్నారు? "చక్రవర్తులు శాసనమునకు అతీతులు" అను న్యాయము ననుసరించి, మీరుకూడ ఈ సనాతన ధర్మసామ్రాజ్యమునకు చక్రవర్తులరై, ఈ ధర్మశాసనములకు అతీతులైనారా యేమి! కాజాలరనుట మాకు నిర్ధారము. మరి—మీ రేల యుల్లంఘించుచున్నారో, మేమే ఈ వ్యాసమునందు మఱొక తావున చెప్పెదము. ఇంతలో, మీ నేటి సనాతనధర్మాచరణ వైఖరిని ఇంకను విపులముగా పరీక్షించుదము.

## 13. ఉంఛవృత్తి

వ్యవసాయమును వాణిజ్యమును బ్రాహ్మణునకు నిషిద్ధములనియు, అతడు ఉంఛవృత్తిచేతనే కడుపునించుకొనవలెననియు మనువు చెప్పుచున్నాడు—వినండి!

27. ఋతముంఛశిలం జ్ఞేయం అమృతం స్యా దయాచితమ్
మృతంతుయాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతమ్॥

28. సత్యానృతంతువాణిజ్యం తేనాపి ఖిలుజీవ్యతే
సేవాశ్వవృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్-(మను)

'అనృతం కృషిః' అనగా వ్యవసాయముచేయుట అనృతము వలె పాపహేతువు కాబట్టి అది బ్రాహ్మణునకు నిషిద్ధము. 'సత్యానృతంతు వాణిజ్యం' అనగా వ్యాపారము కొంత సత్యముతోను కొంత అసత్యముతోను జరుపబడును గాన అదియుగూడ బ్రాహ్మణునకు నిషిద్ధము. మరి బ్రాహ్మణునకు ఏది ధర్మము? 'ఋతముంఛశిలం జ్ఞేయం'—అనగా ఉంఛవృత్తి యొకటే సత్యబద్ధమైనదికాబట్టి దాని నవలంబించుటే బ్రాహ్మణధర్మము. ఉంఛవృత్తి యన నెట్టిది? కళ్ళము నూర్చుగా చెదరి, దాని చుట్టు పడియుండు గింజలను ఏరుకొని బ్రతుకుటయే ఉంఛవృత్తి[10] అయ్యలార! కఠోరమైన ఈ ఉంఛవృత్తిచే బ్రతుకులు కడతేరుట కష్టసాధ్యమని మీరెంత మొత్తుకొన్నను. శాస్త్రములు వినిపించుకొనక "ఉంఛవృత్తిచే జీవనము జరుగనియెడల పండ్లుతిని బ్రతుకండి! అవి దొరుకని యెడల దుంపలు మెక్కి బ్రతుకండి! అవియు దొరుకనియెడల నీరుత్రావి బ్రతుకండి!" అని కొంచమైన మొగమోటములేకుండ చెప్పుచున్నవి.

29. శక్యా న చే దుంఛశిలేన వృత్తిః
ఫలేన మూలేనచ వారిణాచ— (మ. భా.)

మరి మీ "వైదికధర్మోద్ధార"కులలో నెందరు, మీ "సనాతన ధర్మరక్ష"కులలో నెందరు, ఈ సనాతనధర్మము నవలంబించి యున్నారో దయచేసి ఒక్కింత సెలవిచ్చెదరా?

## 14. పట్టణవాసము

బ్రాహ్మణునకు పట్టణవాసము పరిత్యాజ్య మట! సనత్కుమారుని వాక్యము వినండి!

30. తైలయంత్రేక్షుయంత్రాదేః శబ్దో యావత్ ప్రవర్తతే
తావత్కాలం న భోక్తవ్యమ్— (స్మృ. ర.)

అనగా, "నూనెగానుగలు, చెరకుగానుగలు మొదలగు యంత్రములవలన జనించు ధ్వని యెంతకాలము బ్రాహ్మణునిచెవికి వినబడుచుండునో, అంతకాల మాతడు భోజనము సేయరాదు." దీనింబట్టి—నేడు మన పట్టణములలో వెలసిన వందలకొలది ఫ్యాక్టరీయంత్రముల సంకులఘోష యహరహము పట్టణమంతట ప్రతిధ్వనించుచుండుటచే, ఆ పట్టణములలో నిండ్లు కట్టుకొని యున్న మీ "సనాతనధర్మోద్ధార"కు లెల్లరు అహరహము ఉపవసింపవలెను. లేదా, ఆ పట్టణములను విసర్జించి ఆ ధ్వని వినబడనంతటి దూరప్రదేశములో నిండ్లు కట్టుకొనవలెను. కాదా, భోజనవేళకు పూట పూట ఊరివెలుపలికి వచ్చి భోజనము సేయవలెను. లేనియెడల ఈ సనత్కుమార వాక్యమును బట్టి మీ రెల్లరు అనాచారదూషితులగుచున్నారు. మరి ఈ సనత్కుమారవచనమునకు మీ రేల స్వస్తిచెప్పినారు?

## 15. శూద్ర సేవ

బోధాయనమహర్షి యాదేశము వినండి!

31. యదేకరాత్రేణ కరోతి పాపమ్
కృష్ణం వర్ణం బ్రాహ్మణః సేవమానః

చతుర్థకాల ముదకాభ్యుపాయీ
త్రిభిర్వర్షై స్తదపహంతి పాపమ్— (స్మృ. ము.)

వ్యాఖ్య—"కృష్ణోవర్ణః శూద్రః, తదాజ్ఞాకరోభూత్వా వృత్త్యర్థం సేవమానో బ్రాహ్మణో, వర్షత్రయే చతుర్థకాలే మితభోజీ త్రిషవణస్నాయీ ఏక దివసేశవాకృతమ్ పాపమ్ హంతీత్యర్థః." అనగా, వృత్తికొరకు ఏ బ్రాహ్మణుడు ఒక్కరాత్రికాలమం దైనను శూద్రుని సేవించుచున్నాడో, అతడు ఆ ఒక్కరాత్రి పాపమునుండి విముక్తుడగుటకు, మూడేండ్లు — ప్రతియేడును మూడేసినెలల చొప్పున—మితభోజనమును త్రిషవణ[11] మనం బడు శుద్ధిస్నానమును ఆచరింపవలెను. మరి, శూద్రులచే నేడు స్థాపింపబడిన యంత్రాలయములలో కర్మాగారములలో కార్య స్థానములలో, మరియు—శూద్రన్యాయవాదులయొద్ద, శూద్ర ధనికులయొద్ద, వివిధములైన సేవాకృత్యములుసేయుచు, వారి యాజ్ఞల నౌదల ధరించుచు వారి కనుసన్నల సకలకార్యములు నిర్వర్తించుచు జీవించుచున్న వేలకొలది బ్రాహ్మణులు నేడు మన సంఘమునందు ఉన్నారు. వీరి ఈ శూద్రసేవ, ఒకనాటిదే కాదు—అహోరాత్రములు, ఆజన్మాంతము సలుపు సేవ. మరి, యో "వర్ణాశ్రమోద్ధార"కులారా! ఈ బ్రాహ్మణు లందరిచే మీరు పూర్వోక్తస్మృతిధర్మానుసారమైన ప్రాయశ్చిత్తములను ఏల చేయింపజాలకున్నారు ?

## 16. శూద్రపానీయము

దేవలమహర్షి యాజ్ఞాపన వినండి !

32. అతీవ తృషితో విప్రః న శూద్ర స్యోదకం పిబేత్॥

33. శూద్రహస్తేన యో భుంక్తే పానీయం వా పిబేత్క్వచిత్
అహోరాత్రోషితో భూత్వా పంచగవ్యేన శుద్ధ్యతి—(స్మృ. ర.)

అనగా—"ఎంత ఆకలియైనను ఎంత దప్పికలిగినను బ్రాహ్మ ణుడు శూద్రునిచేతి యన్నమునుగాని పానీయమునుగాని స్వీక రింపరాదు. స్వీకరించెనేని, అతడు ఒక పగలు ఒక రాత్రి ఉపవ సించి తదుపరి పంచగవ్యము[12]చే శుద్ధి పొందవలెను." మరి– అయ్యలారా! వైస్రాయిగారి అల్పాహారపు విందుల సందర్భమున బట్లరచే నందింపబడు టీ, కాఫీ, ఐస్ క్రీం మొదలగు పానీయముల ననర్గళముగా నాస్వాదించుచున్న మీ "సనాతనధర్మోద్ధారక" "వర్ణాశ్రమస్వరాజ్యసంఘ" యమ్. యల్. సీ.లు మొదలొక్కని- నాటకమునాటి రాత్రి కుతూకలారుచున్న సందర్భమున, పీర్ సాహేబుగారి ఫిల్టర్ సోడాను ఫిర్యాదు లేకుండ త్రాగుచున్న వందలకొలది బ్రాహ్మణయువకుల వరకు, ఎందరు ఆ పూర్వోక్త మహర్షి యాదేశము నుల్లంఘించుచున్నారో మేము చెప్ప నక్కరలేదు. మరి, ఈ వందలకొలది బ్రాహ్మణుల నెల్లర పట్టు కొని పరుండబెట్టి పంచగవ్యశుద్ధిని బలవంతముగానైన మీరేల చేయలేకున్నారు? నాయనలార! మీ బలము మీ శాస్త్రముల బలము దుర్బలులైన యస్పృశ్యులపైననేగాని బలవంతులైన వీరి యెడల గుడ్డిగవ్వకైన మారదు కదా!

## 17. శూద్రసాహచర్యము

పరాశరమహర్షి యాదేశించుచున్నాడు—

34. శూద్రాన్నం శూద్రసంపర్కం శూద్రేణతు సహాసనం
శూద్రాత్ జ్ఞానాగమః కశ్చిత్ జ్వలంత మపి పాతయేత్ -(స్మృ-ర)

కాబట్టి, శూద్రునియన్నము—శూద్రునిసంపర్కము—శూద్రుని ప్రక్క కూర్చుండుట—శూద్రునొద్ద విద్య నభ్యసించుట—అను ఈ నాల్గును బ్రాహ్మణునకు వర్జనీయములు. అట్లగుట, మన శాసనసభలకుగాని మన పురపాలక సంఘములకుగాని మన

గ్రామ తాలూకా జిల్లాలకు సంబంధించిన ఎట్టి సభలకుగాని, ఏ బ్రాహ్మణుడును సభ్యుడుగా నిలువరాదు. నిలిచి గెలిచి యా సభలకు పోయినయెడల, నిత్యము నేదో యొకరీతిగ శూద్ర సభ్యులతో సహాసనము తప్పదు. కాబట్టి, ఏ బ్రాహ్మణుడును ఆ సభలకు నిలువకుండునట్లు మీరు చేయగలరా? **మరొకవిషయము**—'శూద్రాత్ జ్ఞానాగమః' అని యనుటచే, శూద్ర గురువునొద్ద ఏ బ్రాహ్మణుడును విద్య నభ్యసింపరాదు. మరి—విశ్వవిద్యాలయములు మొదలుకొని వీధిబడులవరకు శూద్ర గురువులులేని పాఠశాలలు, నేడు సాధారణముగ గానరావు. కాబట్టి, ఆ పాఠశాలలందు చదువుచున్న వేలకొలది బ్రాహ్మణ విద్యార్థుల నెల్లర, ఈ పరాశర సూక్తిచే నిగ్రహించి ఏల మరల్ప జాలకున్నారు?

## 18. వేదవిక్రయము

ఉశానసమహర్షి ఉద్ఘోషించుచున్నాడు—

35. శ్రుతివిక్రయిణో యత్ర పరపూర్వాః సముద్రగాః
    అసమానా న్యాజయంతి పతితాస్తే ప్రకీర్తితాః—

36. సముద్రయాయీ కృతహా ఽధ్యాసమయ భేదకః
    వేదనిందా రతశ్చైవ తే వర్జ్యాః శ్రాద్ధకర్మసు— (స్మృ-౯)

ఇందలి ముఖ్యాంశ మేమనగా— వేదవిక్రయము చేసినచో బ్రాహ్మణుడు పతితుడై శ్రాద్ధకర్మలకు అనర్హు డగుచున్నాడు. మరి, అయ్యలారా! నేడు బొంబాయి కాశీ కలకత్తా పూనా మదరాసు మైసూరు మొదలగు మహానగరములందు ముద్రాలయములు నెలకొల్పి, నాగరి బంగాలీ మరాఠీ కన్నడ ద్రావిడ ఆంధ్ర మొదలగు లిపులలో, వేదములను వేదాంగములను[1]

ఉపనిషత్తులను నిర్భయముగా ముద్రించి ప్రకటించి విక్రయించి ధనమార్జించి జీవించుచున్న ఏ అసంఖ్యాక బ్రాహ్మణకుటుంబములు కలవో, ఆ కుటుంబములన్నియు యథాపూర్వముగ శ్రాద్ధకర్మలను చేయుచునేయున్నవి. మరి—సనాతన వైదిక ధర్మమునకు ప్రబల విరుద్ధమైన ఈ వేదవిక్రయమును మీరేల నిరోధింపజాలకున్నారు ?

## 19. క్షీరవిక్రయము

శ్రీ మహావిష్ణువు స్వయముగ సిద్ధాంతీకరించుచున్నాడు—

37. త్ర్యహేణ శూద్రోభవతి బ్రాహ్మణః క్షీరవిక్రయాత్-

[స్మృతిముక్తాఫలే, ఆహ్నికకాండే, విష్ణుపురాణేచ]

అనగా, మూడుపూటలు క్షీరవిక్రయము చేసినమాత్రమున, బ్రాహ్మణుడు శూద్రుడగుచున్నాడు. మరి—మూడుప్రొద్దులు మున్నూట అరవదియైదు దినములు, తమ కాఫీహోటళ్ళలోని కాఫీ టీ కోకో మొదలైన వానియందు క్షీరము కలిపి, విక్రయించి, ధనమార్జించి జీవించుచున్న వందలకొలది తెలుగు శర్మలను, వేలకొలది అరవ అయ్యర్లను, శూద్రులనువలె మీరు బహిష్కరించుచున్నారా ? అట్టి హోటళ్ళలో కాఫీ మొదలైనవి సేవించుటచే శూద్రత్వము ప్రాపించిన లక్షలకొలది యితర బ్రాహ్మణులనుగూడ, బహిష్కరించుచున్నారా ? మీరును మీ శ్రుతి స్మృత్యాదులును ఏకమై ఈ బ్రాహ్మణులను ఈ క్షీరవిక్రయవృత్తినుండి, నేడుగాని—మరొక శతాబ్దమునకుగాని—మరలింప గలరా ?

## 20. సముద్రయానము

పరాశరమహర్షి ప్రవచించుచున్నాడు—

38. సముద్రయాన గమనస్ బ్రాహ్మణస్య నశాస్యతే
సంభవేద్యది మోహేన పునస్సంస్కార మర్హతి- [ప-స్మృ]

అనగా—బ్రాహ్మణుడు సముద్రయానము సేయరాదు. అజ్ఞాన వశమున నొకవేళ చేసెనేని సంస్కారము పొందవలెను. మరి, పాశ్చాత్యవిద్యార్జనము కొరకో ప్రభుత్వ కార్యాదికముల కొరకో కేవల దేశాటనముకొరకో ఏటేట పెక్కు బ్రాహ్మణులు ఇంగ్లాండు మొదలగు ఖండాంతరములకేగి వచ్చుచున్నారు. వీరిలో నూటికి నూర్గురు ఏ సంస్కారమును పొందకయే సంఘములో మరల గలియుచున్నారు. వీరు సంస్కారమును పొందిరా లేదా యను విషయము విచారించుట మాని, మా "వైదిక ధర్మోద్ధార"కులు వచ్చి శ్రాద్ధకర్మలు చేయించుచున్నారు. వివాహాదికములకు వేంచేసి భూరిసంభావనలు స్వీకరించుచున్నారు. అమందానందముతో విందులారగించుచున్నారు. అయ్యలార! సముద్రయాన పాతకమునకేగాక, తన్మూలమున మరి రెండు పాతకములకు వీరు ఎరయగుచున్నారు. మొదటి పాతకము—సముద్ర జలములలో మూత్రపురీషములు విసర్జించుట; ఇది వేదనిషిద్ధము—

39. నాప్సుమూత్రపురీషం వా నిష్ఠీవం సమాచరేత్— [మార్కం]

40. నాప్సు మూత్రపురీషం కుర్యాత్— [తై-ఆ]

రెండవపాతక మేమనగా, ఓడలో భోజనము చేయుట; ఇది కూడ వేదనిషిద్ధము— ఆపస్తంబమహర్షి యాజ్ఞాపించుచున్నాడు—

41. న నావి భుంజీత— [ఆప]

మరి—యో వైదికధర్మోద్ధారకులార ! ఇకనుండి యే బ్రాహ్మణుడును సముద్రయానము సేయకుండునట్లును, చేసినప్పటికిని ఆ సముద్రోదకములలో మూత్రపురీషములు విడువకుండునట్లును మీరు సేయగలరా ?

## 21. కారాగృహవాసము

జైళ్ళకు (చెరసాలలకు) పోయివచ్చిన బ్రాహ్మణు లెల్లరు వైదికధర్మభ్రష్టులట ! మరీచిమహర్షి నుడువుచున్నాడు—

42. మాసం కారాగృహేవాసో నాభిర్యాత్రా దినత్రయమ్
మ్లేచ్ఛావాసే తథాపక్షమ్ యో వసేత్ సతుపాతకీ— (సో మా)

గౌతమమహర్షి సెలవిచ్చుచున్నాడు—

43. బలాత్ కారంబదీకృతోయస్తు మ్లేచ్ఛ చండాల దస్యుభిః
కారాగృహే మాసమాత్ర ముషిత్వా కాయమాచరేత్
ప్రాజాపత్యంచ చాంద్రంచ చరేత్ సంవత్సరోషితః—[స్మృ-ము]

అనగా— కారాగృహమునందు ఒక నెలదినములుండి వచ్చిన బ్రాహ్మణుడు, సంవత్సరకాలము ప్రాజాపత్య చాంద్రాయణాది ప్రాయశ్చిత్తములకు లోనగుచు కఠినోపవాసములతో కడుపులు కాల్చుకొనుచుండవలెను. ఇట్లగుట— ఆత్మదేశముకొరకు నెలలు తరబడిగా ఏండ్లు తరబడిగా చెరసాలలలో వాసముచేసిన చేయుచున్న చేయగల వేలకొలది త్యాగమూర్తులెల్లరును, ఆ చెరసాలలలో ప్రభుత్వమువా రొసంగెడి పరిమితాహారముతో కడుపులు కాల్చుకొనుటయే గాక, ఇండ్లకు వచ్చినవెంటనే మీ శాస్త్రముల ననుసరించి ప్రాజాపత్యాది కఠిన ప్రాయశ్చిత్తములతో మరల కొంతకాలము కడుపులు కాల్చుకొనుచుండవలెను.

అనగా, ఆత్మదేశముకొరకు స్వార్థత్యాగమొనర్చువారికి ప్రభుత్వమువారిచే మొదటిశిక్షయు—ఏ సంఘముకొరకు త్యాగము చేసెనో ఆ సంఘముచేత రెండవ శిక్షయు! నాయనలార! శాస్త్రములందలి ఒక్కొక్కయక్షరము ననుసరించి నడచుకొన వలెనన్నచో, ఎంతటి ఘోరఫలితము ప్రాపింపగలదో గమనించితిరా!

## 22. వాహనములు

వాహనములెక్కి తిరిగెడు మతగురువులు అస్పృశ్యులతో సమానులని మన శాస్త్రముల యభిప్రాయము. (వాహనమనగా యానము. 'వాహనం యానం యుగ్యం పత్రంచ ధోరణం' అని యమరుడు. యానమునకర్థము— 'యాత్యనేన యానమ్'— అనగా, దేనివలన నరుడు ప్రయాణముసేయునో అది యానము. అట్లగుట—ఏనుగులు గుఱ్ఱములు గాడిదలు మొదలగు జంతువులే గాక, మోటార్లు సైకిళ్ళు రైళ్ళు మొదలగునవికూడ యానములే అగుచున్నవి.) ఇట్టి యానములెక్కి తిరిగెడి మతాచార్యుల గూర్చి, శాస్త్రములేమి చెప్పుచున్నవో వినుడు!

44. యానారూఢం యతిం దృష్ట్వా సచైలం స్నానమాచరేత్॥

[స్కాంద కలిధర్మ విచారకాండే]

అనగా, యానమెక్కి తిరిగెడు యతి కంటి కగుపడునేని ఉన్నవారము ఉన్నట్లుగా పోయి స్నానము చేయవలెను (అస్పృశ్య దర్శనమైనట్లు). మరి, ఈ వైదికధర్మవిధికి వ్యతిరేకముగా నేడు మోటార్లు రైళ్ళు ఏనుగులు అవి చాలక నరవాహనములు ఎక్కి ద్రిమ్మరుచున్న మా "సనాతన ధర్మరక్షక" "హిందూధర్మ పునరుద్ధారక" ఇత్యాది భీకరబిరుదధారులైన "జగద్గురు"వుల నేమనవలెను? అయ్యలారా! సర్వసంగ పరిత్యాగులైన యతు

లకు, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వరహితులైన యతులకు, పాద సంచారము యోగ్యమా—లేక, మోటార్లలో మెత్తని పరుపులపై పీపులుసేర్చి, 'శివోహం' 'శివోహం' అనుట యోగ్యమా? ఏమున్నది! శాస్త్రములు మీకు వంటయింటి కుందేళ్ళయినవి! కాని, అస్పృశ్యులయెదుట మాత్రము ఆకొన్న సింగములవలె గర్జించుచున్నవి!

## 23. అబ్రాహ్మణ వృత్తులు

ఇతర వర్ణముల కేర్పడిన వృత్తులచే జీవించు బ్రాహ్మణులెల్లరు కులభ్రష్టులట. మనువు చెప్పుచున్నాడు—

45. పరం స్వధర్మో విగుణో న పారక్యం స్వనుష్ఠితః
పరధర్మాక్రియాత్ విప్రః సద్యః పతితజాతిశః— [మను]

46. శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః— [గీతా]

కాబట్టి—ఎంత చెడ్డదైనను బ్రాహ్మణునకు స్వధర్మమే ఆశ్రయణీయము. ఎంత మంచిదైనను పరధర్మము నిషిద్ధము. పరధర్మాలంబనమువలన బ్రాహ్మణుడు పతితుడగుచున్నాడు. ఇంకను వినుడు—

47. కులటశ్చిత్రకర్మాచ వార్ధుషిశ్చర్మవిక్రయీ
భిషక్చ రజకశ్చైవ రూపాజీవీచ సూచికః—

48. సౌనికో వర్ణికశ్చైవ నిషాదేనసమాః స్మృతాః
కర్మణా తేషు యో మోహాత్ బ్రాహ్మణో వర్తతే సదా—

49. ప్రాయశ్చిత్తేతు చరితే పరిహార్యో భవేత్ బహిః
ఏతే బ్రాహ్మణచండాలాః సర్వే బ్రహ్మహణః కిల—

50. తస్మాత్ దైవేచ పిత్ర్యేచ వర్జితాస్తత్వ దర్శిభిః— [ప. మా]

దీని సారాంశమేమనగా—వ్యభిచారము, చిత్రకళ, వడ్డీవ్యాపారము, చెప్పులు కుట్టుట, వైద్యము, బట్ట లుదుకుట, వేశ్యా

వృత్తి, కుట్టుపని, కసాయి, రంగుల అద్దకము, ఈ వృత్తులచే జీవించువా రెల్లరు, 'నిషాదేన' అనగా 'చండాలురతో' సమానులు. ఈ వృత్తులలో బ్రాహ్మణు డెంతమాత్రమును ప్రవేశింప రాదు. ప్రవేశించెనేని, ఆ బ్రాహ్మణునిసోకిన దోషము ఎట్టి ప్రాయశ్చిత్తముచేనైన పరిహార్యముకాదు. అట్టివాడు 'బ్రహ్మహాణః' అనగా 'బ్రహ్మత్వమును హత్యచేసినవాడు'గా పరిగణింపబడుచున్నాడు. కావున అట్టి బ్రాహ్మణులను అస్పృశ్య సమానులుగా నిరసించి, వారిని 'దైవేచ' అనగా 'దేవకార్య' ములందును 'పిత్ర్యేచ' అనగా 'పితృకర్మ' లందును పూర్తిగా బహిష్కరింపవలెను. అయ్యలారా! ఈ శాస్త్రోక్తధర్మమును యథావిధిగా పాలింప బూనినచో ఎట్టి విపరీతవ్యవస్థ సంభవింప గలదో చూడుడు! ఎట్లన— నేటి బ్రాహ్మణులలో, బూట్లు (చెప్పులు), మందులు, కుట్టుపని, చిత్తరువులు వ్రాయుట, ఈ మొదలగు వృత్తుల నవలంబించియున్న పెక్కురు గృహస్థులును, రాష్ట్రీయవిఖ్యాతి గాంచిన పెక్కురు వడ్డీవ్యాపారులును, (బ్యాంకర్స్-Bankers), అఖిలభారతయశస్సు నార్జించిన పెక్కురు భిషగ్రత్నములును, అంతర్జాతీయ కీర్తివహించిన పెక్కురు చిత్రకళా ధురంధరులును, 'ఏతే బ్రాహ్మణ చండాలాః సర్వే బ్రహ్మహాణఃకిల' అను సూక్తికి గురియై, 'దైవేచ' 'పిత్ర్యేచ' వర్జనీయులగుచున్నారు! హా! శాస్త్రము లందలి ప్రత్యక్షరమును అనుసరించినచో ఎట్టి విపరీత ఫలితము సంభవింపనున్నది!

## 24. బ్రాహ్మణ నటీ నటకులు

నాట్యవృత్తిచే జీవించు బ్రాహ్మణులను గూర్చి శాస్త్రము లేమి చెప్పుచున్నవో వినుడు!—

51. రజక శ్చర్మకారశ్చ నటోబురుడ ఏవచ
కైవర్త మేదభిల్లాశ్చ సప్తైతేంత్యజాః స్మృతాః— [మితా]

52. చండాలా ద్వివిధాః అంతరా బాహ్యశ్చ;
అంతరాపి ద్వివిధాః; తత్రప్రథమే ఆద్యాః
రజకశ్చర్మకారశ్చ నటోబురుడ ఏవచ— [స్మృ మా]
ఏతే విప్రై ర్వర్జ్యాః ప్రయత్నతః— [తత్రైవ]

ఈ శ్లోకముల యభిప్రాయమునుబట్టి చూడగా మన శాస్త్రములు నటవృత్తిని చండాలురకు మాత్రమే నిర్దేశించినవి. అందువల్లనే ఆ నటవృత్తి బ్రాహ్మణులకు 'వర్జ్యాః ప్రయత్నతః' అని శాసించుచున్నవి. మరి—చండాలురకే తగిన ఆనాట్యవృత్తి నవలంబించి జీవయాత్ర చేయుచున్న వందలకొలది నేటి బ్రాహ్మణ నటీనటులెల్లరు చండాల సమానులుగా పరిగణింపబడ వలసిన దేనా ? హరహర ! శాస్త్రములందలి ప్రత్యక్షరమునకు విధేయులము కాబూనినచో ఎట్టి విచిత్రఫలితము ప్రాపింపనున్నది !

## 25. ఆంధ్రులు -ఆంధ్రభూమి

ఆంధ్రులు పుండ్రులు పుళిందులు శబరులు మొదలగువారు దస్యులు (అడవిజాతులవారు) అనియు, వీరు విశ్వామిత్రుని సంతతివారనియు, ఐతరేయబ్రాహ్మణము నుడువుచున్నది—

53. తస్యహ విశ్వామిత్ర స్యైకశతంపుత్రా ఆసుః। పంచాశదేవజ్యాయాంసో మధుచ్ఛందసః। పంచాశత్కనీయాంస స్తద్యే జ్యాయాంసోనతే కుశలం మేనిరే। తా ననువ్యాజహారాం స్తాన్వః ప్రజాభక్షీష్టేతి। త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందామూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్ర దస్యూనాం భూయిష్ఠాః—
[ఐ. బ్రా]

దస్యులకు నివాసమగుటచే ఈ యాంధ్రభూమిపై ఏ బ్రాహ్మణు
డును అడుగిడరాదని శాస్త్రకారులు విధించినారు. అడుగిడునేని
సంస్కారముచేగాని శుద్ధిపొందడట ! వినుడు !—

54 సింధు సౌవీర సౌరాష్ట్రాం స్తథా ప్రత్యంత వాసినః
అంగవంగకళింగాంధ్రాన్ గత్వా సంస్కారమర్హతి— [మితా]

కొందరు శాస్త్రకారులు 'తీర్థయాత్రాంవినాగత్వా' [14] అన్నారు; కాని, ఎట్లైనను ఫలితమొక్కటే. ఏలయన— ఏ భూమియం దడుగిడుట సంస్కారమునకు హేతువగుచున్నదో, ఆ భూమియందు నేడు వేలకొలది బ్రాహ్మణులు శాశ్వతముగా నివసించుచున్నారు. మరి—సనాతనధర్మ విధ్వంసకుల మనియు, నవనాగరీకతావ్యామోహుల మనియు, శ్రుతి స్మృతి పురాణ ధిక్కారకుల మనియు, మీచే నపహసింపబడుచున్న మేమును మా అస్పృశ్యులును, పాపమో ! పుణ్యమో !, ఈ భూమియందే పడియుండెదము ! మరి—మీ 'సనాతనధర్మోద్ధార'కులును, మీ 'వర్ణాశ్రమధర్మపోష'కులును దయచేసి సకుటుంబముగా ఎన్నడు రైలు ఎక్కెదరు ?



## 26. ఇతరభూములు

ఒక్క ఆంధ్రభూమియేగాక మన భారతఖండములో మూడువంతుల భూమి మీ 'ధర్మోద్ధార'కులకు వర్జనీయము ! 'నేతి' 'నేతి' (న+ఇతి) [15] యనుచు మన మహర్షులు తుదకు జీవాత్మను గుర్తించినారు. 'నేతి' 'నేతి' యనుచు మేముకూడ మీకు నివాసయోగ్య భూభాగమును నిరూపించుచున్నాము. శాస్త్రములన్నియు నేకగ్రీవముగ ఏమని ఘోషించుచున్నవో వినుడు !

55\. సింధు సౌవీర సౌరాష్ట్ర మావంత్యం దక్షిణాపథమ్
తీర్థయాత్రాంవినాగత్వా పునస్సంస్కార మర్హతి— [స్మృతి-చం]
56\. సౌరాష్ట్ర సింధు సౌవీర మవంతీం దక్షిణాపథమ్
ఏతాన్ బ్రాహ్మణోగత్వా పునస్సంస్కారమర్హతి— [బోధా]
57\. త్రిశంకో ర్వర్జయేత్ దేశం సర్వం ద్వాదశయోజనం
ఉత్తరేణ మహానద్యా దక్షిణేనతు కీకటాత్
దేశ స్త్రైశంకవో నామ శ్రాద్ధకర్మణి వర్జితః— [నిర్ణ]
58\. కిరాతేషు కలింగేషు కొంకణేషు ఖసేష్వపి
సింధో రుత్తరకూలేషు నర్మదాయాశ్చ దక్షిణే
పూర్వేణ కరతోయాయా నదేయం శ్రాద్ధ ముచ్యతే— [నిర్ణ]
59\. సింధు సౌవీర సౌరాష్ట్రాం స్తథా ప్రత్యంతవాసినః
అంగవంగకళింగా (oంధ్రాం) శ్చగత్వాసంస్కారమర్హతి—[మితా]

కాబట్టి, మీరు శ్రాద్ధకర్మలుచేయుటకు నిషేధింపబడిన భూభాగము లెవ్వియనగా—

1. దక్షిణాపథము—అనగా ఆంధ్ర ద్రవిడ కేరళ చోళ పాండ్య కొంకణ కొంకణ మహారాష్ట్రాది దక్షిణ భారతఖండ మంతయును—
2. ఓఢ్ర కళింగములు—అనగా నేటి ఒరిస్సాయును, చెన్నరాజధాని ఉత్తరభాగమును—
3. అవంతి సౌరాష్ట్ర సింధు సౌవీరములు—అనగా నేటి బొంబాయి రాజధాని ఉత్తరభాగమంతయును—
4. ఉత్తరసింధుభూములు—అనగా నేటి బెలూచిస్థాన్ ఫ్రాంటియర్ పరగణాలును—
5. అంగవంగములు—అనగా నేటి బెంగాల్ బీహార్ రాష్ట్రములును—

ఈ భూభాగములన్నియు శ్రాద్ధకర్మాచరణమునకు నిషేధింపబడినవి. ఇక—నిషేధింపబడక మిగిలిన భూభాగ మెద్దియని పరిశీలింపగా, పశ్చిమమున సింధువు మొదలుకొని తూర్పున పాట్నా వరకును, ఉత్తరమున హిమాలయము మొదలుకొని

దక్షిణమున ఉజ్జయిని వరకు గల ప్రదేశముమాత్రమే యని తేటపడుచున్నది. (ఈ ప్రదేశమునందే ప్రాచీనుల యార్యావర్త మున్నది.) కావున ఇదితక్క పరిశిష్ట భారత భూఖండ మంతయు మీకు శ్రాద్ధకర్మాచరణమునకు నిషేధింప బడినది. అట్లగుట, అశ్రాద్ధ్యమైన యీ భూభాగములందు మీ 'వైదికధర్మోద్ధార'కు లింకను శ్రాద్ధకర్మలు చేయుచుండుటచే నవి యశాస్త్రీయములును అధర్మదూషితములునై తన్మూలమున మీ పితరులు లుప్తపిండోదకక్రియు లగుచున్నారని మా యనుమానము! కాబట్టి సనాతన ధర్మాచరణబద్ధకంకణులరగు మీరెల్లరు సకుటుంబముగా ఆర్యావర్తమునకు ఎప్పుడు రైలు ఎక్కెదరు? శాస్త్రములను గుడ్డిగా అనుసరింప బూనినచో మీకు ఈ ఆర్యావర్త ప్రయాణము అవశ్యకరణీయ మనుట నిస్సందేహము!

## 27. బ్రాహ్మణులు - బ్రిటిష్‌రాజ్యము

మీ 'సనాతన ధర్మోద్ధార'కులు శూద్రరాజ్యమునందు నివసింపరాదు. మనువు శాసించుచున్నాడు—

60. న శూద్రరాజ్యే నివసేత్ నా ధార్మికజనావృతే
న పాషండిగణాక్రాంతే నో పస్పృష్టేంత్యజైర్నృభిః— [మను]

మరి, నేడు మీరు నివసించియున్న ఈ రాజ్యము శూద్రరాజ్యము కూడ కాదే! శూద్రులకన్న అంత్యజులకన్న హీనులని చెప్ప బడిన గోమాంస భక్షకులగు మ్లేచ్ఛుల రాజ్యమే!

61. గోమాంసభక్షకో యస్తు లోకబాహ్యంచ భాషతే
సర్వాచారవిహీనోఽసౌ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే—
[జాతి వివేకే - సూతసంహితాయాం]

కాబట్టి, మీరు మీ సనాతన ధర్మమును రక్షించుకొనుటకై, మీ పురాణబొంకులను మీ స్మృతిశతఘ్నులను మీ శ్రుతి

మిషీన్ గన్నులను ప్రేల్చి ఈ బ్రిటిష్‌వారిని ఓడ యెక్కింతురా! లేక మీరే ఓడ యెక్కుదురా! పాపము! మీకు ఓడ యెక్కెడి అధికారముకూడ లేదు! ఏలయన 'సముద్రయానగమనం బ్రాహ్మణస్య న శాస్యతే' యనికదా మీ శాస్త్రముల యాదేశము! దీనింబట్టిచూడ, త్రిశంకుస్వర్గమున [16] వ్రేలాడుటయే మీకు కర్తవ్యమనుట స్పష్టము!

## 28. సివిల్ క్రిమినల్ ప్రొసీజర్ చట్టములు

ఈ బ్రిటిష్ పరిపాలనములో నేడు అమలునందున్న సివిల్ క్రిమినల్ చట్టములు మీ సనాతన ధర్మమునకు ఎంతవిరుద్ధములో యోచించితిరా? స్మృతికర్తలు ఏమని యాజ్ఞాపించుచున్న వనగా— "బ్రాహ్మణుడు తనకన్న తక్కువ కులమువానిని జంపినచో అతనికి శిక్ష, రాష్ట్రబహిష్కారము. తక్కువ కులము వాడు బ్రాహ్మణుని జంపినచో అతనికి శిక్ష, శిరచ్ఛేదనము! బ్రాహ్మణుడు వ్యభిచరించినచో 500 పణములు [17] శిక్ష. ఆ యపరాధమే క్షత్రియుడొనర్చినచో 100 పణములును, అదిగాక గార్దభమూత్రముతో స్నానమును ఆపైన శిరోజఖండనమును, శిక్ష. ఆ వ్యభిచారమే శూద్రుడొనర్చినచో ఏ యంగముచే నతడు వ్యభిచరించెనో ఆ యంగమును ఖండించుటయే శిక్ష!" (బోధాయన,1–18, 19). అనగా మన శాస్త్రముల ప్రకారము శిక్షానిర్ణయము అపరాధుని యపరాధమునుబట్టికాదు— అపరాధుని కులమునుబట్టి చేయవలెను! మరి— నేటి మన సివిల్ క్రిమినల్ చట్టములు బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదమును పాటింపక అన్నికులములవారిని సమానముగ శిక్షించుచున్నవే! ఇందువలన మీ సనాతన వైదిక ధర్మమునకు విపరీతమైన

ప్రమాదము సంభవింపలేదా? మరి— ఈ బోధాయనుని ముందిడుకొని, మన పరిపాలకులతో మీరు భండన మేల చేయకున్నారు? ఏమున్నది! బలవంతులైన వీరియెదుట మీరు భీరులు! దుర్బలులైన అస్పృశ్యుల యెదుట మాత్రము అసహాయశూరులు!

## 29. అపశ్రుతి - అవలయ

అయ్యలారా! మీరు అసహాయశూరులై విజృంభించి, హరిజనసంఘ సంస్కర్తలను నిందించుచు నపహసించుచు, వారిపైన శాస్త్రములందలి శ్లోకములను శరపరంపరలుగా గుప్పుచు, అప్పుడప్పుడు మహత్తర వీరావేశముతో నొసంగుచుండు మీ గంభీరోపన్యాసములను వినగా వినగా, ఆసేతుహిమవన్నగ పర్యంతమైన యీ భారతఖండమందు ఆ వేదోక్త సనాతన ధర్మము నేడు సుధామధుర కంఠస్వరముతో విజయగీతికల నాలాపించుచున్నట్లును, ఆ మధురాలాపములో ఈ హరిజన సంఘ సంస్కర్తల విలాప మొక్కటే అసహ్యమగు నపశ్రుతిగా విన్పించుచున్నట్లును స్ఫురింపక మానదు. కాని, ఆ వేదోక్త సనాతనధర్మము నేడు 'అ' మొదలు 'క్ష' వరకును అపశ్రుతిలో నాలాపించుచు అవలయలో తాళము వేయుచున్న విషయమును మీ రంగీకరింపరు; అంగీకరించినచో మీకు అస్పృశ్యతా నివారణమును ప్రతిఘటించు నధికారమె ట్లుండును?

## 30. నెమరు

శ్రీ శంకర భగవత్పాదులవారి సూక్తి రత్నమును మరల నొక్కసారి నెమరువేయుదము—

62. బ్రాహ్మణత్వస్యహి రక్షణేన రక్షితస్స్యాత్ వైదికో ధర్మః
తదధీనత్వాత్ వర్ణాశ్రమ భేదానామ్— [గీ. భా]

అనగా, వర్ణాశ్రమధర్మమంతయు బ్రాహ్మణత్వముమీద నాధార పడి యున్నది— ఆ బ్రాహ్మణత్వము సురక్షితముగా నున్నంత కాలము వైదిక ధర్మమునకు హాని కలుగదు. కాబట్టి, బ్రాహ్మణుడు తన ధర్మమును వేదోక్తరీతిగా నెరవేర్చుచున్నంతకాలము, తక్కిన మూడువర్ణములవారు కూడ తమ ధర్మములను యథావిధిగ నిర్వహించుకొందురు. ఏలయనగా—ధర్మాచరణమునందు తక్కిన మూడువర్ణముల వారికిని బ్రాహ్మణుడే మార్గదర్శి— బ్రాహ్మణుడే గురువు—బ్రాహ్మణుడే ప్రమాణము. అట్టి బ్రాహ్మణుడే ధర్మచ్యుతుడైనప్పుడు, తక్కిన వర్ణములవారు కూడ తమ తమ ధర్మముల నతిక్రమించుటయు తత్కాలమున అశేష వైదికధర్మమునకు హాని సంభవించుటయు అసహజము కానేరదు. అందువల్లనే శంకరభగవత్పాదుల యమోఘసూక్తి మనకు పునఃస్మరణీయమగుచున్నది—

63. బ్రాహ్మణత్వస్యహిరక్షణే రక్షితస్స్యాత్ వైదికోధర్మః- (గీ. భా)

మరి— అయ్యలారా! వర్ణాశ్రమవిధులకు కట్టుకంబమైన ఈ బ్రాహ్మణత్వమును— సనాతనధర్మమునకు జీవగఱ్ఱయైన ఈ బ్రాహ్మణత్వమును మీరేలరక్షించుకొనుటలేదు ? మీ బ్రాహ్మణత్వమును మీరు రక్షించుకొనినగదా సనాతనధర్మమునకు సంఘములో స్థానమేర్పడుట ? తక్కిన బ్రాహ్మణులసంగతి యెట్లున్నను, "వర్ణాశ్రమ ధర్మపోష"కుల మనియు "సనాతన ధర్మ పునరుద్ధార"కుల మనియు బయల్వెడలిన మీరైనను ఈ సనాతనధర్మమును స్వయముగ నాచరింపవలదా ? అయ్యలారా! బ్యాంకులలో వేలకొలది ధనమును భార్యాపుత్రుల కొరకు భద్రపరచి, మేడలలో హంసతూలికాతల్పములపై అధునాతన నాగరీకతాసంలభ్య సదుపచారములతో హాయిగ జచ్చు

టయా వానప్రస్థము!! సన్న్యాసము!!! "ఓ బ్రాహ్మణు లారా! మీకు సత్యమే ధనము. సమత్వమే సంపద. శీలమే కలిమి. నిగ్రహమే నిధి" అనుచు ఆ వ్యాసుడు— ఆ జ్ఞాన వృద్ధుడు— ఆ భారతవిజ్ఞానపితామహుడు నెత్తి నోరు బాదు కొనుచున్నాడు.

64. నైతాదృశం బ్రాహ్మణ స్యాస్తి విత్తం ॥ యథైకతా సమతా
సత్యతాచ । శీలం స్థితి ర్దండనిధాన మార్జవం,
తత స్తత శ్చోపరమః క్రియాభ్యః — [గీ. భా]

ఓ "సనాతనధర్మపునరుద్ధార"కులారా! మీరు సత్యప్రేరితులే యగుదురేని స్వార్థత్యాగులే యగుదురేని, రండు! అరువది సంవత్సరములు గతించిన ప్రతిబ్రాహ్మణగృహస్థుడును, సంతాన మును వీడి మిద్దెలువిడచి మేడలువిడచి మాన్యములు విడచి వడ్డీవ్యాపారములు విడచి రండు! దండకారణ్యమునందు ప్రవే శింపుడు! పిదప సన్న్యాసమును స్వీకరింపుడు! అంతేకాదు. ఇంకను రండు! ఎన్నివేల బ్రాహ్మణవిద్యార్థు లిపుడు పొట్ట కూటికై పాశ్చాత్య విద్యాభ్యాస మొనర్చుచున్నారో వారినెల్లర ఆ పాఠశాలలనుండి ఈక్షణమే తొలగించుడు! ఈ పాశ్చాత్యవిద్య మీకు శ్రుతిప్రోక్తమా? ఇది యజనమా? యాజనమా? అధ్యయనమా? అధ్యాపనమా? ఇంకను రండు! ఎన్నిలక్షల లౌకికోద్యోగములు చేసి ఎన్నివేల పరవర్ణీయవృత్తులందు ప్రవే శించి ఎంతధనమును సంపాదించినారో, ఆధనమంతయు సనా తన ధర్మవిరుద్ధముగా సమార్జింపబడిన పాపభూయిష్ఠ ధనము! దాని నంతయు బంగాళాఖాతములో పారవేయుటకు మీరు సంసిద్ధులా? అయ్యలారా! ఈ వృత్తులు శ్రీకృష్ణుడు మీకు శాసించిన 'శమ' మునకు దగునా? ఆ 'దమ' మునకు దగునా

ఈ వృత్తుల వలన మీ రార్జించిన ధనమంతయు ఆ 'తపస్సు' వలననే వచ్చినదికాబోలు! విపరీతము! "వర్ణాశ్రమధర్మోద్ధార "కులారా! శాస్త్రములన్నింటిని తెచ్చి యస్పృశ్యుల నెత్తిపై గొట్టనేల? అవి యస్పృశ్యతా ధర్మశాసనమునకు మాత్రమేనా? బ్రాహ్మణధర్మశాసనమునకు గాదా? ఆ శాస్త్రముల నితరులకు బోధించుటయేనా మీ పని? స్వయముగా ననుష్ఠించుటకు గాదా?

## 31. బ్రాహ్మణుడు - ధర్మచ్యుతి

అస్పృశ్యతను నివారింపబూని గాంధిమహాత్ముడు సనాతన ధర్మమును తగులబెట్టుచున్నాడని మీరు ఘోషించుచున్నారు. మా ఘోష యేమనగా, మహాత్ముడును అస్పృశ్యతా సమస్యయు రాకపూర్వమే, మీరే మీరు దానిని తగులబెట్టుకొన్నారు, అని. మీలో నూటికి నూర్గురు ఆశ్రమవిహీనులు నూటికి నూర్గురు తపఃభ్రష్టులు. నూటికి తొంబదుగురు నిషిద్ధ పరవర్ణీయవృత్తిస్వీకారులు. నూటికి తొంబదుగురు సంధ్యోపాసనవర్జితులు. అయ్యలార! అన్నవిక్రయము చేయు మీ వంటపూటియిండ్లు, క్షీరవిక్రయముచేయు మీ కాఫీహోటళ్ళు, ధనవిక్రయము (వడ్డీవ్యాపారము) చేయు బ్యాంకులలో మీ షేర్లు, కన్యావిక్రయముచెయు మీవివాహములు, సర్వవస్తు విక్రయము చేయు మీ యంగళ్ళు! ఆహా వైదికమతము! వర్ణవ్యవస్థ!! సనాతన ధర్మము!!!

## 32. ఒక క్రొత్తచట్టము

అయ్యలారా! ఒక మహత్తరవిషయమును గూర్చి మీ రాలోచించుకొనుడు— శారదాచట్టము, విధవా వివాహ

చట్టము, సివిల్ వివాహచట్టము, అస్పృశ్యతా నివారణచట్టము, ఈ మొదలగు చట్టములెల్ల "సనాతనధర్మమునకు విరుద్ధములు" అని ఘోషించుచు, మీరు మన సర్కారువారికి బంపిన విజ్ఞాపనములును, ఆ సందర్భమున మీరుచేసిన యాందోళనమును, చూపిన యట్టహాసమును, కనుపరచిన పట్టుదలను, సర్కారువారు ఆమోదించి మీ విజ్ఞాపనప్రకారము ఆచట్టముల నన్నింటిని నేటితో రద్దుచేసినారని అనుకొందము. రద్దుచేసిన యనంతరము సర్కారువారికి ఒక సరిక్రొత్త యాలోచన కలుగ వచ్చుననుకొందము. "ఏ న్యాయముచేత మాలమాదిగలచే సనాతనధర్మమును (అనగా అంటరాని తనమును) పాలింపజేయు చున్నామో, ఆ న్యాయముప్రకారమే బ్రాహ్మణులచేతగూడ ఆ సనాతన ధర్మము నాద్యంతము శాస్త్రోక్తరీతిగా వేల పరిపాలింప జేయరాదు?" —అని యాలోచించి, "చాతుర్వర్ణ్యధర్మ పునరుద్ధారణచట్టము" నొకదానిని నిర్మించినారను కొందము. అట్టి చట్టము నిర్మించు నధికారము పాలకులకు లేదని మీరు వాదింతు రేమో? శాస్త్రముల యాదేశము వినండి—

65. 'నా విష్ణుః పృథివీ పతేః' [చాటు]

66. 'విష్ణోరంశేన జాయంతే
పృథివ్యాం చక్రవర్తినః' [వాయు 57-72]

రాజులు విష్ణ్వంశసంభూతు లట! మానవులకు రాజే విష్ణువట! మరియు ఏ రాజ్యమందలి ప్రజలచే వర్ణాశ్రమధర్మములు యథావిధిగా ఆచరింపబడుచుండునో ఆ రాజ్యమున కధిపతియైన రాజు సుఖియు, ఇహమునందును పరమందునుగూడ ధన్యజీవియు అగునట.

67. వర్ణధర్మా న సీదంతి యస్యరాష్ట్రే తథాశ్రమాః
రాజ్ఞస్తస్యసుఖంతాత పరత్రేహచ శాశ్వతమ్—[మార్కం. 24-31]

వర్ణాశ్రమధర్మముల నతిక్రమించి తనప్రజలు వర్తించు నెడల, అట్టి మూఢులను తర్జించి, వారిచే ఆ ధర్మములను మరల ఆచరింపజేయునట్టి రాజు స్వర్గమున కర్హుడట—

68. ఉత్పథగ్రాహిణో మూఢాన్ స్వధర్మాచ్చలితాన్ నరాన్
యః కరోతి నిజేకర్మే సరాజా స్వర్గమృచ్ఛతి—

69. ఏవమాచరతే రాజా చాతుర్వర్ణ్యస్యరక్షణమ్
సుసుఖీ విహరత్యేష శక్రస్యైతి స లోకతామ్—
[మార్కం—24—31, 34]

తన ప్రజలు స్వధర్మము నాచరించుచున్నారో లేదోయని తెలుసుకొనుటకై, రాజు తన చారులను నియోగించుట అవశ్య కర్తవ్యమట.

70. మారుతః సర్వభూతేషు నిగూఢశ్చరతే యథా
ఏవంచరే స్న్వపశ్చారైః పౌరామాత్యారి బంధుషు—
[మార్కం—24—28]

ఎవడు స్వీయవర్ణాశ్రమధర్మమును ధిక్కరించునో వాడు రాజ దండనమునకు పాత్రుడట. అట్టివానిని ఉపేక్షసేయక వానిచేత ఆ ధర్మమును మరల పాలింపజేయుటకై, రాజు ఎట్టి కఠినచర్యను గైకొన్నను తప్పులేదట.

71. సయాతి బ్రహ్మలోకంహి యావదింద్రాశ్చతుర్దశ
యోఽనుల్లంఘ్యస్వకం ధర్మం స్వవర్ణాశ్రమసంజ్ఞితం॥

72. నరోన్యథాప్రవర్తేత సదండ్యో భూభృతో భవేత్
యేచ స్వధర్మసంత్యాగా త్పాపం కుర్వంతి మానవాః॥

73. ఉపేక్ష తస్తా నృపతేంష్టపూర్తం ప్రయాత్యధః
తస్మాద్రాజ్ఞాప్రయత్నేన సర్వేవర్ణాః స్వధర్మతః
ప్రవర్తంతేన్యథా దండ్యాః స్థాప్యాశ్చైవ స్వకర్మసు—
[మార్కం—25—34, 35]

కాబట్టి, మనచేత వర్ణాశ్రమధర్మములను పాలింపజేయుటకై మన నేటి సర్కారుకు సంపూర్ణాధికారము కలదని నిర్ధారిత మగుచున్నది. అందువలన, పూర్వోక్తమైన "చాతుర్వర్ణ్యధర్మ పునరుద్ధారణ చట్టము" నొక దానిని మన సర్కారువారు నిర్మించి రనియే అనుకొందము. ఆ "పునరుద్ధారణచట్ట" నిబంధనలకు బద్ధులై అస్పృశ్యులును బ్రాహ్మణులునుగూడ, ప్రవర్తించుచున్నారో లేదోయని పరీక్షించుటకై సర్కారు వారిచే నియమింపబడు రక్షకభటులును సి. ఐ. డీ లును మిమ్ము ఈగలవలె ముసురుకొందు రనుకొందము. అపుడు ఆ చట్టమునకు విరుద్ధముగా దేవాలయప్రవేశమునకై యత్నించు ప్రతి మాలవానికి శిక్ష—బ్రాహ్మణవీధిలో నడచిపోవు ప్రతి మాదిగవానికి శిక్ష—ఊరి నడుమనున్న బావులలో నీరుతోడు ప్రతి చండాలునకు శిక్ష. మరి— అదే చట్టమునకు విరుద్ధమగుటచే, ఆశ్రమ స్వీకారముచేయని ప్రతి బ్రాహ్మణునకు శిక్ష—శమదమాదులులేని ప్రతి బ్రాహ్మణునకు శిక్ష—సంధ్యాగ్నులు సేయని ప్రతిబ్రాహ్మణునకు శిక్ష—వడ్డి వ్యాపారముచేయు ప్రతి బ్రాహ్మణునకు శిక్ష—అన్న క్షీరశస్త్రాదులను విక్రయించు ప్రతి బ్రాహ్మణునకు శిక్ష—వేయునేల ? అట్టి "చాతుర్వర్ణ్యధర్మ పునరుద్ధారణ చట్టము"ను సర్కారువారు నిర్మించి, దాని నిబంధనల ప్రకారము మీ యపరాధములనెల్ల శిక్షింప మొదలు పెట్టినయెడల, మీలో నూటికి నూర్గురు న్యాయస్థానముల కెక్కుటయు శిక్షితులగుటయు సంభవింపక తప్పదు. అట్టి చట్టమును నిర్మింపబూనినచో అపుడు సర్కారువారిలో మీ రేమని మొరపెట్టుకొందురో మాకు తెలియును. "విక్టోరియా సప్తమ ఎడ్వర్డు పంచమ జార్జి మొదలగు పాలకులుచేసిన వాగ్దానము ప్రకారము మీరు మా

హిందూ మతవిషయములందు ఎంతమాత్రము జోక్యము కలిగించుకొన గూడదు.''అని. కాబట్టి, పాలకులు జోక్యము కలిగించుకొనుటకు వెనుదీయుదురు. ఇక, మీవిషయమై జోక్యము కలిగించుకొనుటకు ఎవరున్నారు? మిమ్ము శాసించుటకు ఎవరున్నారు? ఎవ్వరును లేరు! వింత! మీచేత వర్ణాశ్రమధర్మములను పాలింపజేయుటకై ఏ ప్రభుత్వమైన నడుముకట్టెనా సహింపరు! మీరు మాత్రము, ఆ నోరులేని నిర్భాగ్య హరిజనులచే ఆ సనాతనధర్మమును విధ్యుక్తముగా పరిపాలింప జేయుటకు నడుములు బిగించినారు! ఏ ధర్మశాస్త్రములందలి సర్వోత్తమశాసనములను మీరుల్లంఘించుచున్నారో, ఆ ధర్మశాస్త్రములందలి యధమాధమ శాసనములను ఆ హరిజనులపై ప్రయోగించుటకు ఉద్యుక్తులైనారు! ఆహా మీ ధర్మనిరతి! సత్యనిష్ఠ!

## 33. క్షత్రియుడు

అగ్రజాతిగా జన్మించి ఈ అమూల్య సనాతనధర్మమును రక్షించు బాధ్యతగల్గిన మీరు పూర్తిగా ధర్మభ్రష్టులైనప్పటికిని, మీకన్న తక్కువ వర్ణములవారని చెప్పబడుచున్న క్షత్రియ వైశ్య శూద్రులు ఆ సనాతన ధర్మమును అంతో యింతో నేటికిని ఆచరించుచునే యున్నారు. నేటి క్షత్రియుని సంగతి యోజింతము. శ్రీకృష్ణభగవాను డేమని శాసించుచున్నాడు ?

74. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం
దానమీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మస్వభావజం- (గీత, 18_43)

కాని, జయాపజయములు దైవాధీనము లగుటచే నేడతనికి స్వతంత్రరాజ్యము లేదు. అందువలన ప్రజారక్షణమును లేదు.

 

## 34. వైశ్యుడు

వైశ్యునకు శాస్త్రోక్తధర్మము లెవ్వియనగా—

75. కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం- (గీత, 18-44)

అనగా—వాణిజ్యము, కృషి, పశురక్షణము, ఇవి వైశ్యునకు విధ్యుక్త ధర్మములు.

## 35. శూద్రుడు

శూద్రుని విధులెవ్వియనగా—

76. పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం- (గీత,18-45)

ఈ విధి ననుసరించి నేటికిని మీ సంఘమునకు ఆతడు పరిచర్య చేయుచునే యున్నాడు. మీ మురికిగుడ్డలనుదుకు రజకుడై, మీకు క్షురకర్మ చేయు నాపితుడై, మీ దుస్తులుకుట్టు సౌచికుడై మీ చెప్పులు కుట్టు చర్మకారుడై, మీ పాత్రాదికములనిర్మించు లోహకారుడై, మీకు బూలదండలు సమకూర్చు మాలికుడై, మీ పైరులు పండించు హాలికుడై, మీ యాభరణములు సేయు స్వర్ణకారుడై, మీ మేడలు మిద్దెలు నిర్మించు శిల్పియై, ఇట్లొకటి కాదు—ఒక లక్ష విధముల మీసంఘమునకు సేవచేయుచునే యున్నాడు. అందువలన నేటి శూద్రుడొక్కడే సనాతన హిందూ ధర్మమును అక్షరశః ఆచరించుచున్నాడనియు, అతడొక్కడే "నిజమైన హిందువుడను నేను!" అని సగర్వముగా ముక్తకంఠముతో చెప్పుకొనుటకు అధికారము కలవాడనియు నిశ్శంకముగ చెప్పవచ్చును.

## 36. మీరు ?

ఇక మీరో? ఏ ధర్మశాస్త్రలు పై నుదహరింపబడిన ధర్మములను ఆ వరవర్ణములవారికి[18] విధించియుండెనో, ఆ ధర్మ

శాస్త్రతే ఆ శాస్త్రమునందే ఆ యధ్యాయమునందే ఆ శ్లోకము లకు ప్రక్కశ్లోకములందే మీకు విధించుచున్న యజన యాజ నాది షట్కర్మలను, బ్రహ్మచర్యాది చతురాశ్రమములను, శమదమ తపశ్శౌచాది నవవిధ సాత్త్విక లక్షణములను ధిక్క రించి, సనాతనధర్మ సామ్రాజ్యము నంతయు అరాజకముగా నొనర్చినారు. అంతేకాదు— మీ యగ్రజాతీయవృత్తులువినా అవరజాతీయవృత్తు లన్నింటిని ఆచరించుచున్నారు. ఇచ్చట ఒక ప్రతివాదముతో మీరు మమ్మెదుర్కొనవచ్చును. దానిని గూడ పరామర్శింతము.

## 37. కొన్ని యుపద్రవములు

"ఇతరవర్ణముల కేర్పడిన ధర్మములను అవలంబించుటకు శాస్త్రములు మాకు అధికారము నొసంగుచున్నవి. కాబట్టి, పరవర్ణీయధర్మ స్వీకారము మాకు తప్పుకాదు"—అని మీ 'ధర్మోద్ధార'కులు వాదింపవచ్చును. సరే. పరవర్ణీయధర్మస్వీ కారమును మీకు శాస్త్రము లెప్పు డంగీకరించుచున్నవి ? మీకు ప్రామాణికాగ్రగణ్యమైన పరాశరస్మృతి యేమి చెప్పు చున్నదో వినుడు।

77. దేశభంగే ప్రవాసేవా వ్యాధిషు వ్యసనేష్వపి
రక్షేదేవ స్వదేహాని పశ్చాద్ధర్మం సమాశ్రయేత్ —

78. ఏనకేనచ ధర్మేణ మృదునా దారుణేనవా
ఉద్ధరేత్ దీన మాత్మానం సమర్థో ధర్మ మాచరేత్ —

79. ఆపత్కాలే సముత్తీర్ణే శౌచాచారంతు చింతయేత్
శుద్ధిం సముద్ధరేత్ పశ్చాత్ స్వస్థోధర్మం సమాచరేత్ — [పరా]

దీని సారాంశము—కొన్ని కొన్ని యుపద్రవములందు బ్రాహ్మ ణుడు తన దేహమును రక్షించుకొనుటకై ఎట్టి ధర్మాతిక్రమణ

మైన చేయవచ్చును. ఆ యుపద్రవములు గతించిన పిమ్మట, మరల నతడు స్వధర్మము ననుష్ఠించుకొనవచ్చును. ఆ యుపద్రవము లెవ్వియనగా, దేశభంగము—ప్రవాసము—వ్యాధి—వ్యసనము. మరి—నేడేమి యుపద్రవము వచ్చినది ? దేశభంగ మేమి ప్రాపించినది ? ప్రవాస మెట్టిది తటస్థించినది ? ఇది ప్రశాంతమైన బ్రిటిష్ పరిపాలనమే ! మీ దేవాలయముల నేల మట్టు మొనరించి, మీ తలలపై 'జిజియా' [19] పన్నువిధించిన మహమ్మదీయ పాలనము కాదే యిది! ఈ బ్రిటిష్‌పాలకులు మీ యాశ్రమముల జోలికి రవ్వంతయైన రారే ! ఏ ప్రవాసమునులేక మీరు సుఖముగ స్వదేశమందే యున్నారే ! ఆమూలనుండి ఈ మూలవరకు దేశమును తుడిచివేయుచున్న మహామారి మొదలగు వ్యాధులు లేవే ! ఒకరి యాటంకము లేకుండ నిశ్చల చిత్తములతో మీరు మీ యాశ్రమ చతుష్కమును కర్మషట్కమును సాత్త్వికనవకమును ఆచరించుకొనుటకు ఈ బ్రిటిష్‌పరిపాలనమును మించిన అనుకూల పరిపాలనము వేరొండు లేదే ! మరి, ఏల యతిక్రమించినారు ? అస్పృశ్యతానివారణోద్యమమును ప్రతిఘటించుచు, "సనాతనధర్మోద్ధర"ణమును గూర్చి మహోపన్యాసము లొనంగెడి మీలో, ఎందరు వానప్రస్థులో ఎందరు షట్కర్మనిరతులో ఎందరు తపస్సంపన్నులో లెక్కవేసి చూచినయెడల మీ యాత్మశుద్ధియు మీ సనాతనధర్మ సిద్ధియు లోకమునకు వెల్లడిపడును. అయ్యలారా ! ఆశ్రమముల నధోగతి పాలుజేసి, షట్కర్మలను మహర్షుల కప్పగించి, శమదమతపస్సులను శ్మశానభూమికి బారద్రోలి, వీటికన్నిటికిని మూలసాధనమైన ఇంద్రియ నిగ్రహమునకు సమాధికట్టి, విషయైక ప్రవిష్టులై వ్యసనైకలాలసులై ధనదాహదగ్ధులై సుఖజీవలుబ్ధులై, మీ

సత్యజీవనమునకు—మీ వేదోక్త ప్రవర్తనకు—మీ యగ్రజాతి
త్వమునకు — మీ మార్గదర్శకత్వమునకు — మీ యశేష
హిందూ సంఘ గురుత్వమునకు—ఉత్తర దక్షిణధ్రువములంత
విరుద్ధములైన ఈ పాశ్చాత్యవిద్యలు—ఈ లౌకికోద్యోగములు—
ఈ ధన సంచయనము—ఈ ధాన్యసంగ్రహణము—ఈ వడ్డీలు—
ఈ వ్యాపారములు—ఈ వ్యాజ్యములు — ఈ మేడలు—ఈ
మిద్దెలు... ఔరా! ఇది యెట్టి సనాతనధర్మము!... అయ్యలారా
చేత కమండలువు—నొసట విభూతి—శిరమున శిఖ—భుజ
మున జోలి—కటిని కౌపీనము—కనుల బ్రహ్మతేజము—మన
సున అహింస—వాక్కున సత్యము—కాయమున నిగ్రహము—
మరల నవధరించి, మీ కోటిమంది బ్రాహ్మణులు కోటి 'భూదే
వతా' స్వరూపములతో ఈ భారత భూమిపై మరల విహ
రించుచు, కోటి బ్రహ్మతేజః కిరణములచే ఈ భూమిని పరరాజ
దుర్నిరీక్ష్యముగ నొనర్చుచు, కోటి కంఠధ్వనులతో ఋక్సామ
గానముల నాలాపించుచు, 'కోటి గురుకులాశ్రమములలో
ముక్కోటి హిందువులను ఆత్మదేశోద్ధరణ ఆత్మ సంఘోద్ధరణ
ఆత్మధర్మోద్ధరణ విద్యలయందు నుత్తీర్ణులను గావించుటకన్న
పరమమైన పవిత్రమైన సనాతన ధర్మము మీకు వేరొండు
కలదా? ఆకుటిండ్లలో నివసించుచు ఉంఛవృత్తిచే జీవించుచు
ఈ పవిత్రధర్మమును అతిసుకరముగా అనాయాసముగా మీ
రాచరింపతగునే!... అకటా! ఆ సనాతనధర్మమెక్కడ! మీ
రెక్కడ! నిర్మలమైన నిర్భర తేజో భరితమైన నిఖిల మానవ
కళ్యాణ సంధాయకమైన ఆ ప్రాచీనధర్మమే మీయందు నేడు
కలదేని, పంచ మహాఖండములును మీకు జోహారు లొన
రింపవా? ఈ ప్రాచీన భూమిపై దట్టముగ నేడు గ్రమ్ముకొని

యున్న అంధకారమెల్ల ఈ క్షణమునందు పటాపంచేలు కాదా ?......అయ్యలారా ! మీ సుఖలాలసత్వమే మీ ప్రాచీనధర్మ చ్యుతికి ప్రధానహేతువైనది. మీరు—వశ్య వాక్కులును సిద్ధకర్ములును తేజఃపుంజములును జితేంద్రియు లును అగు మహర్షుల యంశమునం దవతరించిన వ్యసన హిమా లయములరు ! అరిషడ్వర్గదండ కారణ్యములరు ! ఐహికవాంఛా మహాసాగరములరు !......నాయనలారా ! మీ యింద్రియ నిగ్రహ రాహిత్యమునకు మేము నిందింపము. ఏలయన, ఇది కలి కాలము—ప్రవృత్తి పరమైన యుగము. కాన, మీరు ఆ సనా తన ధర్మమును ఆచరింపజాలకపోవుట ఒక వింతకాదు. మరి— వింతయేమనగా, మీరు దానిని ఆచరింపజాలకున్నను, మీ వలెనే ఆచరింపజాలని ఇతరుల యెడల మీరు ప్రదర్శించుచున్న అలీక పాండిత్యము, ఆత్మౌపమ్య రాహిత్యము, అర్థ్యధికారము అను నీ మూడును మాకు వింతలుగా దోచుచున్నవి.

## 38. అలీక పాండిత్యము

పూర్వోక్తరీతిని మీరు మీ సుఖలాలసత్వముచే ప్రాచీన ధర్మమును విడనాడి, పరవర్ణ యువ్రుత్తిస్వీకారాదులైన వేలకొలది యధర్మములలో బ్రవేశించి, ఆ యధర్మముల కన్నింటికి సధర్మ తను సంఘటించు శాస్త్రప్రమాణములను వెదకివెదకి పేర్చికూర్చి "ఇవిగో మాకు శాస్త్రప్రమాణములు !" అని మీరు వాదిం చుటయే అలీక పాండిత్యము.

## 39. ఆత్మౌపమ్య రాహిత్యము

ఆత్మౌపమ్యరాహిత్య మనగా తన కష్టసుఖముల వంటివే ఇతరులవి అని భావింపకుండుట. అనగా— శాస్త్రములందలి

ప్రత్యక్షరము ననుసరించి వర్తించుటనేడు మీ కెంత కష్టమో అస్పృశ్యులకు గూడ అంతేకష్టమని గ్రహింపజాలకపోవుట. ఇదియే ఆత్మౌపమ్య రాహిత్యము.

## 40. ఆర్యధిక్కారము

ఇక ఆర్యధిక్కారము— ఈ ప్రాచీనార్యజాతిని నిదుర నుండి మేల్కొలిపి మరల నుత్తేజితముగా నొనర్చుటకై అస్పృశ్యతా నివారణాది సాంఘిక మహోద్యమములందు పనిసేయు చున్న వేలకొలది సంఘసంస్కరణాభిలాషులను—అపహసించి, ప్రతిఘటించుట యేదికలదో అదియే ఆర్యధిక్కారము. అయ్యలార! 'జగద్గురు' బిరుదములు ధరించి ఏనుగులపై నెక్కి ద్రిమ్మరు మీ మత గురువులలో పెక్కరయందు ఈ ఆర్య ధిక్కారమను దుర్వ్యసనము నేడు మూర్తీభవించియున్నది. అహంకారముచే పోతరించిన వీరు 'కర్తాహం' అని విఱ్ఱవీగుటలో ఆశ్చర్యము లేదు.

80 అహంకార విమూఢాత్మా కర్తాహ మితిమన్యతే— (గీ. భా)

అయ్యలార! ఈ 'జగద్గురు' వులలో నెవ్వరు "సత్యంవద, ధర్మంచర, సత్యాత్ న ప్రమదితవ్యం, ధర్మాత్ న ప్రమదితవ్యం, ఏష ఆదేశః, ఏష ఉపదేశః"[20] అను వేదశాసనమును బొదల ధరించి స్వయముగా ననుష్ఠించు చున్నారో, వారికి మా ప్రణామములు. వీరిలో నెవ్వరు సమగ్ర వేదాంతపరిజ్ఞానులై, 'యద్దృశ్యమ్ తన్నశ్యమ్'[21] అను సూక్తిని సాక్షాత్కార మొనర్చుకొని, ఈ మానవసంఘముతో నెట్టి జోక్యమును కలిగించు కొనక, ఈ సంఘమును దీని సంస్కర్తలను దూరదూరముగ విసర్జించి పోవుచున్నారో, వారికి మా సాష్టాంగములు. వీరిలో నెవ్వరు "కలౌ సంఘే శక్తిః"[22] అను సూక్తిని విశ్వసించి, ఆ

సంఘమును ఉజ్జ్వలవంతముగా జేయుటకై నేడు పాటుపడుచున్న వేలకొలది సంస్కర్తలను 'విజయోస్తు' అని యాశీర్వదించు చున్నారో, వారికి మా కైవారములు. వీరిలో నెవ్వరు "యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి, సర్వ భూతేషు చాత్మానం తతోనవిజుగుప్సతే" యని సర్వభూత సమత్వమును చాటుచున్న ఉపనిషత్సూక్తిని విశ్వసించి, దీనహరిజనులనుగూడ నిజసోదరులుగా పరిగణించి, వారిని 'త్వమేవాహం' 'త్వమేవాహం' [23] అను నామంత్రణముతో గాఢాలింగనము సేయు చున్నారో, అట్టివారికి మా జోహారులు. కాని—వీరిలో నెవ్వరు, 'భిక్ష' లనుపేర శిష్యులవలన ధనసంగ్రహణము సేయుచు— 'సేవ' లనుపేర పడుచులచే నొడళ్లు పట్టించుకొనుచు— 'బోధ' లనుపేర కాంతలతో నేకాంతముసేయుచు— 'ఉపవాసము' లను పేర వెన్న జున్ను మీగడ పాలు హల్వా మొదలగు బలకర పదార్థములతో కండలు పెంచుచు—పగలు సన్న్యాసము, రాత్రి సంగము—పగలు జోగులు, రాత్రి భోగులు—ఈ విధ ముగా ఎవరు నటించుచున్నారో, అట్టి కలుషవర్తనులకు, కాషాయవసన గౌరవ ఘాతకులకు, మా ధిక్కార సహస్ర ములు! ... ...కాని, మన దౌర్భాగ్యవశమున ఈ చివర తరగతి వారి సంఖ్యయే అంతకంతకు ప్రబలుచున్నది. నేడు వీరు పుట్ట కొక్కులవలె పొటకరించి దేశ మందంతట దీటుకొని తీండ్రించు చున్నారు. ఈ తరగతి 'జగద్గురు'వులు, శంకరాచార్య ముద్రచే జెల్లుబడియగుచున్న కృత్రిమ (ఫోర్జరీ) నాణెములు. వీరు, మతముపేరిట మూఢజనులను మోసపుచ్చి బ్రతుకుచున్న కలి పురుషుని యగ్రసంతానము. వీరిలో ఇంద్రియ నిగ్రహము హుళక్కి, సత్యనిష్ఠ పూర్ణానుస్వారము, అహింస గగన

కుసుమము. వీరు అహంకార కూపములు—ఆడంబర హిమాలయములు. ఎల్లప్పుడును ప్రజలు తమకే వశులై తాము చెప్పునదే ధర్మమని నమ్మువారలై, తమకు వివేక దాస్యము చేయుచుండవలెనని వీరియాశ.

# మండనాధ్యాయము

## 41. సంతబసివి

అయ్యలార ! మేము పండితదూషకులముకాము. పెద్దలను తిరస్కరించుటయే మామతముకాదు. ఏజాతి, తన పెద్దలను తన పండితులను తన యాచార్యులను తన వైజ్ఞానికులను గౌరవించుకొనదో ఆజాతికి పురోవృద్ధి కలుగ నేరదనియే మా నిశ్చితాభిప్రాయము. కాని పెద్దలనగా తలనెరిసినవారెల్లరు పెద్దలు కాజాలరని మా విన్నపము.

81. న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః
యోవై యువాప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః (మ. భా)

"జ్ఞానవృద్ధుడగునేని తల నెరియకున్నను యువకుడే పెద్దలకు పెద్ద". ఇక పండితుడన నెట్టివాడు? "అగ్నిమీడే పురోహితమ్ యజ్ఞస్య దేవమృత్విజమ్" అను ఋక్కు మొదలుకొని "అన్నమైతే నేమిరా మరి సున్నమైతే నేమిరా" యను గంగదాసుగారి తత్త్వము వరకుగల అశేషవాఙ్మయమును, అగ్రప్రాశన చేయగలిగిన చండ మేధావంతులెల్లరు పండితులగుదురా ?

82. పండా ఆత్మవిషయా బుద్ధి ర్యేషాం తేహి పండితాః

ఎవడు తన్నుతా నెరుంగజాలునో అతడే పండితుడు. అట్టి పండితునకు ప్రథమలక్షణము, సర్వసమత్వదృష్టి.

83. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః

ఇక పుట్టగోచులు పెట్టుకొన్న బోడిసాములెల్లరు పుణ్యబోధకులగుదురా ?

84. "తలలు బోడులైన తలపులు బోడులా ?"

అనుచు మహానుభావుడైన వేమన ముచ్చటైన అచ్చ తెనుగులో ముద్దుముద్దుగ చెప్పినాడు. ఇంక శంకరుడో ? గర్జించుచున్నాడు——

85. 'జటిలో ముండీ లుంఛితకేశః
కాషాయాంబర బహుకృతవేషః
పశ్యన్నపిచ నపశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తం బహుకృతవేషః

ఇక——ఆచార్యులన నెట్టివారు ? దుశ్శాలువలు, మకర కుండలములు, పట్టెవర్ధనములు (లేక త్రిపుండ్రములు), పావుకోళ్లు, చక్రాంకితములు (లేక లింగముద్రికలు), సంచారములు, శిష్య బృందములు, ఏనుగు, అంబారి, 'అయ్యవారు', 'ఉత్సవము', 'అర్చన', 'సేవ', 'భిక్ష', ఇత్యాదులు ఇత్యాదులు——ఇవియా ఆచార్య లక్షణములు ? వ్యాసుడు చెప్పుచున్నాడు—

86. ఆత్రేష్ట ప్రాపకా ధర్మా ఆచార్యైరుపదిశ్యతే
వృద్ధాహ్యలోలుపాశ్చైవ ఆత్మవంతో హ్యదంభకాః——

87. సమ్యగ్వినీతా ఋజవస్తా నాచార్యాన్ ప్రచక్షతే——

88. స్వయమాచరతే యస్మాదాచారం స్థాపయత్యపి
ఆచినోతి చ శాస్త్రార్థాన్ యమైః సన్నియమైర్యుతః' ——
[వాయు——53——29——30]

తాను ఇతరుల కుపదేశించు ధర్మములను ఎవడు స్వయముగ తన జీవితమునందును తన వర్తనమునందును అనుష్ఠించుచున్నాడో అతడే ఆచార్యుడు. అట్టి ఆచార్యత్వమునకును దంభత్వ లోలుపత్వములకును చుక్కయెదురు. మరి—ఊరేగింపులు బూరగొమ్ములు పూలపల్లకీలు పుణ్యాంగనలు పోలీలు పులిహోరలు బొబ్బట్లు, ఇవి 'అలోలు'పత్వమునకును 'అదంభ'కత్వమునకును సాక్ష్యములా? కాకున్నచో ఈ 'అయ్యవా'ర్లు ఎవరు? ఈ 'జగద్గురు'వు లెవ్వరు? వారిచుట్టు మూగిన ఆ మూకలు ఎచ్చటివి? ఆ మూకలు ఆచరించుచున్న ఆ సాష్టాంగములకు అర్థమేమి? అదిగో! ఆయన అభయ హస్తమెత్తి యాశీర్వదించుచున్నాడు. అల్లవిగో! ఆ మూకలు ఆనంద బ్యాష్పాతిరేకమున ఆపాదమస్తకము కంపించుచున్నవి. అవిగో! కరతాళధ్వనులు మిన్నుముట్టినవి! బూరగొమ్ములు భాంకరించినవి! అరుగో పుణ్యాంగనలు! అవిగో హారతులు—దీపములు—ధూపములు—తన్మయతలు—అపస్మారము—ఆవేశములు—మూర్ఛలు! ఆమెకు 'శ్రీకృష్ణుడు ప్రత్యక్ష'మైనాడట! ఈమెకు 'విఠల్ ప్రసన్న' మట! ఆమె 'గిన్నెలోని పాయసమును కుసుమ హారనాథుకు అట్టె త్రాగి పోయె'[24] నట! అరరే! ఏమి యీ విపరీతము!!—గొవులాటి నా హిందువుడా! మంజు మంజులములైన హిమగిరి సానువులందలి పచ్చికబయళ్ళలో మేసి మేసి, మధుర మధురములైన గంగా సింధువుల రేవులలో త్రావి త్రావి, సుగంధగంధిలములైన స్వేచ్ఛా మలయ సమీరముల నాస్వాదించి యాస్వాదించి, మోరయెత్తి, ముజ్జగములు మారుమ్రోగునట్లు 'అహంబ్రహ్మాస్మి!'[25] యని అంకెవేసిన నీ వెక్కడ? ఈ 'అయ్యవా'ర్ల సంతలో—ఈ 'చిల్లరసరుకు' దుకా

గాముల మ్రోల 'ఔనౌ' ననుచు తలయూడించుచున్న ఈ సంత
బసివి [36] యెక్కడ ?

## 42. మహోద్దండశక్తి

అయ్యలారా ! "సనాతన ధర్మబోధ"కులైన ఈ ఆచార్య
ప్రభువులును, "సనాతన ధర్మపునరుద్ధార" కులుగా బయల్వెడలిన
మీరును ఏకమై, పెక్కు శతాబ్దములనుండి ఈ దురదృష్ట భారత
జాతిచే ఎట్టి కఠోరదాస్యము చేయించినారో తలచుకొన్న
యెడల—హృదయ విదారకము !... నేడు ఔపాసన మంత్రము
కూడ మరచిపోయిన బ్రాహ్మణులు పెక్కురున్నారు—కాని,
ప్రతిపూటయు భోజనవేళ అనాలోచితముగా అప్రయత్నముగా
వారి చేయి విస్తరిచుట్టు ప్రదక్షిణము చేయునేల ? యజ్ఞోపవీత
ధారణము చాలించిన బ్రాహ్మణులు పెక్కురున్నారు—కాని,
ఆచారవంతుల యిండ్లకు భోజనమునకై పోయి అక్కడ మడి
బట్టలతో కూర్చుండవలసిన ఘట్టము తటస్థించినపుడు, తమకు
జందెము లేనిసంగతి జ్ఞప్తికి వచ్చి కలవరపడెద రేల ? పితృకర్మల
యందు నమ్మకము లేని బ్రాహ్మణులు పెక్కురున్నారు—కాని,
వారి పితరుల యాబ్దికము వచ్చినపుడెల్ల దానిని శ్రద్ధతో నాచ
రింపవలె ననియే తహతహ పడెద రేల ? వారు అల్లారుముద్దుగా
కనిపెంచిన బిడ్డలెవరైన కాలధర్మము చెందినపుడు, 'ఏ యనా
చారము చేసినందువలన భగవంతుడు తమకీశిక్ష విధించెనో'
యను భయముచే ఆపాద మస్తకము కంపించెద రేల ? అంతే
కాదు—బ్రాహ్మణుడు శూద్రునియింట అన్నముతినుటకై ఎంత
భయపడునో, శూద్రుడుకూడ బ్రాహ్మణునిచే తనయింట
నన్నము తినిపించుటకు అంతకన్న నెక్కువ భయపడు నేల ?
బ్రాహ్మణుడు మాలవాని నంటుటకు ఎంత భయపడునో, మాల

వాడుకూడ బ్రాహ్మణుని స్పృశించుటకు అంతకన్న నెక్కువ భయపడునేల? 'ఇవియెల్ల మూఢాచారములని నా యంతరాత్మ నాకు బోధించుచున్నది. కాబట్టి నేను వీనిని తృణప్రాయము లుగా ధిక్కరించెదను'—అని నీవు ఎంత ధైర్యము వహించి నప్పటికిని, ఏదో యొక అపూర్వ అదృశ్యశక్తి నీ చెవియొద్ద చేరి 'ఓయీ మూఢా! ఈ ధర్మములు నీ వాచరింపక తప్పదు. లేనియెడల—జాగ్రత!' అనుచు అహరహము నీకు హెరికిసుందు పోయునేల? ఇవి ఆచరింపనియెడల 'ఏమి నష్టి యడచునో' యను అనుమానము పెనుభూతమై నిన్ను వేధించు నేల?... చిత్రాతి చిత్రము! నీ కనులకుగాని చెవులకుగాని ఘ్రాణమునకుగాని రసనకు గాని తనువునకుగాని, ఆ మాలవానియందు ఎట్టి వైపరీత్యలవ లేశము కూడ గోచరింపకున్నను, ఆతడు నిన్ను ఇట్టె తాకినంత మాత్రమున ప్రచండ ఝంఝా మారుతమునకు కదలబారు వృక్షమువలె నా మూలాగ్రముగ కంపించెదవు! విపరీతము! నీ పంచేంద్రియములకు స్వయముగా గోచరింపని ఈ అతీంద్రియ — అలోకసామాన్య— భయోత్పాతమునకు నిన్ను గులాముచేసిన ఆ ప్రచండశక్తి యెక్కడనుండి వచ్చినది? నీ బుద్ధిని ముగ్ధ మొనరించి, దాని స్వాతంత్రవిచారమును నిర్బంధించి, దాని స్వేచ్ఛాప్రచారము నరికట్టి, దానికి అనంగీకారములైన పనులను దానిచేతనే చేయించుచున్న ఈ లోకైక మహోద్దండ శక్తి యెక్కడనుండి వచ్చినది?

## 43. హిట్లర్ – ముస్సోలినీ

హిట్లర్ ముస్సోలినీ మొదలగు నియంతల పరిపాలనము అత్యంత దౌర్జన్య భూయిష్టమనియు, అది మానవజాతి పురోవృద్ధికి హానికరమనియు మనము విన్నాము. కాని, ముప్పది

కోట్ల హిందువుల నైతికజీవనముపై— ప్రపంచ జనసంఖ్యలో ఆరవపాలు నరుల యాధ్యాత్మిక జీవనముపై—ఈస్మృతులు, శాస్త్రములు, ఆచారములు వందలకొలది యేండ్లనుండి చెలాయించుచున్న ఏకైక నిర్భిన్న నిరంకుశాధికారము ముందు, ఆ హిట్లర్ ముస్సోలినీల నిరంకుశత్వ మెంత! ఆ హిట్లర్ ముస్సోలినీలు లక్షలకొలది మానవుల ఆర్థికశక్తిని హరించి వారిని కఠోరమైన రాజకీయ దాస్య శృంఖలలతో నిర్బంధించియుండవచ్చు—వారి తనూధన మానముల హరించియుండవచ్చు. కాని, మన శాస్త్రములో? ఆ తనూధనమానము లన్నింటికంటె నమూల్యమై, పశుజన్మమునకును మానవజన్మమునకును గల భేదమును నిరూపించెడు బుద్ధిని—వివేకమును—మనీషను—అట్టడుగునకు దిగద్రొక్కి, వారికి స్వతంత్ర యోజనా దౌర్బల్యమును ఘటించి, ఇంకను గొన్ని తరములవరకు ద్రెంచుకొనజాలనంతటి దుర్దాంత శాస్త్రదాస్య శృంఖలలతో వారిని కట్టివైచిన ఈ దారుణదౌర్జన్యము ముందు, ఆ హిట్లర్ ముస్సోలినీల దౌర్జన్యము, వీసెరాయి దెబ్బముందు విసనకర్ర ప్రహారమువలె వెలవెల బోవుచున్నది.

## 44. కవిత్వము — పైత్యము

ఇంతటి నిర్భిన్న నిరంకుశాధికారముతో భారతజాతిని పాలించుచున్న ఈ శాస్త్రము లెక్కడనుండి వచ్చినవి? వీని రచయిత లెవ్వరు? ఇవి మనకు ప్రమాణములా? వీనియందు ప్రతిపాదింపబడిన వెల్ల సనాతనధర్మములా? ఈ మొదలైన ప్రశ్నలకు సమాధానముగా, ఈ శాస్త్రములు సంకరస్వరూపము లనియు, వీనియందు 'తాళ్ళపాకవారి కవిత్వమును మా పైత్యమును' విరివిగా మిశ్రమమై యున్నదనియు, ఇవి అన్యోన్య

ప్రతులా !— వానికి అపార్థములు కల్పించియు భిన్నార్థములు కల్పించియు విపరీతార్థములు కల్పించియు, ఎవరికి తోచినట్లు వారు, మంత్రములనియు, బ్రాహ్మణములనియు, స్మృతులనియు భిన్న భిన్న సాంప్రదాయములతో భిన్న భిన్న దర్శనములతో పరస్పర విరుద్ధమునైన ప్రతిపాదనలొనరించి వైదిక వాఙ్మయము నెల్ల పెకలించుకొన శక్యముగానంతటికి వెనుకొంపిలో దిగ దింపెదరట.

94. ఋషిపుత్త్రైః పునస్తేషాం [illegible] విపర్యయైః
మంత్రబ్రాహ్మణవిన్యాసైః స్వర [illegible]-

95. సంహితా ఋగ్యజుస్సామ్నాం సంహన్యంతే శ్రుతర్షిభిః
సామాన్యాద్వైకృతాచ్చైవ దృష్టిభిన్నైః క్వచిత్క్వచిత్-

96. సామాన్య [illegible] [illegible]
అథర్వ [illegible] [illegible].

97. తథా వాక్యర్ ఋక్సామ్నాం [illegible]
[illegible]- [వాయు 58]

ద్వాపరమునం దారంభమైన ఈ భిన్నస్మృతి కలియుగమునాటికి మరింత సంకరస్వరూపము జెందునట.

98. స్మృతిశాస్త్రప్రభేదాశ్చ ప్రస్థానాని పృథక్ పృథక్
ద్వాపరేష్వభివర్తంతే మతిభేదాస్తథా నృణామ్-

99. తేషాం భేదాః ప్రభేదాశ్చ [illegible]
ద్వాపరే సంనివర్తంతే [illegible] కలౌ-

పరస్పర సామరస్యము లేక ఈ శాస్త్రమొకటియు ఆశాస్త్రము వేరొకటియు చెప్పిన హేతువుచేత ధర్మము దురవగాహమగు నట. అందువల్ల ఏది ధర్మము ఏది అధర్మము అని విస్పష్టముగా నెరుంగుటకు వీలులేక ధర్మాధర్మవిచారమంతయు తలనొప్పికి కారణమగునట.

100. పరస్పర విభిన్నైస్తైర్దృష్టీనాం విభ్రమేణచ
అయంధర్మో హ్యయం నేతి నిశ్చయో నాధిగమ్యతే- [వాయు, 68]

ఇచ్చట మేముదహరించిన వాయుపురాణమును "వైదిక ధర్మోద్ధార"కులు ప్రమాణముగా నంగీకరింప రేమో? అంగీకరింపనిచో వ్యాసునియెడల మహాపచారమగును. ఏలయన, వ్యాసమహర్షి నాలుగు వేదములను పరిష్కరించినపిమ్మట, పంచమవేదమను పేరుతో ఇతిహాస పురాణములను (స్త్రీ శూద్రాదులకు ప్రత్యేకముగా నుపకరించునట్లు) విరచించెనట.

101. ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదాశ్చత్వార ఉద్ధృతాః
ఇతిహాస పురాణంచ పంచమోవేద ఉద్ధృతా
ఏవం చకార ధీమాన్ వ్యాసః కృపణవత్సలః- [భాగ]

అంతేకాదు—"వేదము లెన్ని చదివినను వేదార్థము పురాణ సాహాయ్యముచేతనే లెస్సగా తెలియుననియు, ఎవడు పురాణమును తృణీకరించునో వానివలన తనకు ఆపద (అనర్థము) సంభవించునను భయముతో వేదము వానినుండి దూర దూరముగా పారిపోవు" ననియు వ్యాసమహర్షి నుడువుచున్నాడు—

102. యోవిద్యాచ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః
నచేత్పురాణం సంవిద్యాన్నైవ సస్యాద్విచక్షణః—

103. ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్
బిభేత్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహరిష్యతి—
[వాయు I—200. 1, 2]

అట్లగుట పురాణములెల్ల వ్యాసప్రోక్తములనియు, అవి "వైదిక ధర్మోద్ధార"కులకు శిరసా అవధార్యములనియు తేటపడినది.

## 45. దొంగస్మృతి

కాబట్టి—అయ్యలారా! మన స్మృతులలో పురాణములలో ఇతిహాసములలో వ్రేలుపెట్టని విద్వాంసుడు లేడు. ఛంద

స్సునేర్చిన ప్రతికవియు, ధర్మబోధకుడనని బయల్వెడలిన ప్రతి యాచార్యుడును, ఎవరికితోచినశ్లోకములను వారు వ్రాసి,ఆశ్లోకము లకు 'సూతఉవాచ' 'శౌనకఉవాచ' 'వైశంపాయనఉవాచ' అని బొట్టుపెట్టి వానిని లోకాదరణకు పాత్రములుగా ఆయా శాస్త్ర ములలో నూరేగించినారు. ఈ దొంగసృష్టి, లోకమునందలి ఏ యితరవాఙ్మయమునందుగూడ ఇంత విరివిగా ఇంత నిర్భీక ముగా చేయుబడి యుండలేదు. ఈ దుర్గతి మన స్మృతిపురాణేతి హాసాదులకేగాదు; ప్రాజదువులను పేరిట పరమపూజ్యములైన శ్రుతులకు గూడ పట్టినది. ఎవడోయొక కడుపుకక్కుర్తి పండి తుడు, 'అల్లా' పేరిట ఒక యుపనిషత్తును సృష్టించి దానిని వైదిక వాఙ్మయములో జేర్చినయద్భుత సాహసకార్యమును మీరెరింగి యున్నారని మా తలంపు.

## 46. అల్లాయస్వాహా ।

ఉదాహరణపూర్వకముగా ఆ "అల్లోపనిషత్తు"ను ఇచ్చుట వివరించుచున్నాము.

104. ఓమ్ అస్మల్లాం ఇల్లామిత్రా వరుణో దివ్యానిధత్తే ఇల్లల్లా వరుణో రజాపునర్దదుః హయామి మిత్రో ఇల్లాం ఇల్లల్లాం వరుణోమిత్రో తేజ కామః హోతారమిన్ద్రో మహాసురింద్రా అల్లో జ్యేష్ఠమ్ శ్రేష్ఠమ్ పరమమ్ పూర్ణమ్ బ్రహ్మణమిల్లమ్ అల్లోరసుర మహామదరకం వరశ్చ అల్లో అల్లం ఆదల్లవుక మేకకం అల్లాంవుకమ నిఃఖేదకమ్ అల్లోయజ్ఞేన హుత హుత్వాం అల్లా సూర్యచంద్రసర్వనక్షత్రాః అల్లో ఋషీణాంశ్చ దివ్యేంద్రాయ పూర్వ మాయాన్తు పరమాణుః అంతరిక్షా అల్లో పృధివ్యా అంతరిక్షం విశ్వరూపం దివ్యానిధాతే ఇల్లల్లా వరుణో రాజపునర్దదుః ఇల్లేకవర ఇల్లాకవర ఇల్లల్లాతి ఇల్లల్లాః ఇల్లాఇల్లల్లా అనాది స్వరూప అధర్వణో శాఖం హ్రూంహ్రీం

జనాన్ పశూన్ సిద్ధాన్ జలచరాన్ అదృష్టం కురుకురుఫట్
అసుర సంహారిణీమ్ హ్రీం అల్లోరసూర మహామదరకం బీర్యశ్చ అల్లో
అల్లాం అల్లిల్లాతి ఇల్లిల్లాః.

నేటికిని మన వైదిక వాఙ్మయమునందు ఈ ఉపనిషత్తు ముద్రణా గౌరవము వహించియున్నది. ఏలయన, జ్ఞానము ముదిరిన పండితులు కొందరు 'అస్యాని ఇత్యత్ క్విప్ అవేభూషాయై గృహ్ణాతి లాతి లా' అను వ్యుత్పత్తిని పురస్కరించుకొని, 'అల్లా' యను శబ్దమును అనుగుణంట తప్పి, 'తల్లి' యను అర్థమును పెట పెటపికలించి, 'అల్లా ఉపనిషత్తు'నకు విచిత్రమైన అంతరార్థమును చెప్పి దానిని సమర్థించినారు.

## 47. ఏది ధర్మము?

ఇట్టి అపరస్పృష్టితో నిండియున్న మన వాఙ్మయము నుండి, ఏది ధర్మమో ఏది కాదో తెలియగలుగుటెట్లు? ఔను- ఏది ధర్మము? ఏది అధర్మము? ప్రశ్నలకు ప్రశ్న! భయంకర ప్రశ్న! ఔను. ఏది ధర్మము? బ్రహ్మ తానుసృజించిన సరస్వతిని (అనగా తనకొమార్తెను) తానే వివాహమాడెనట— ధర్మమా? అధర్మమా? నహుషుడు తన సొంత చెల్లెలను (విరజను) పెండ్లియాడి ఆమెయందు సంతతి గాంచెనట— ధర్మమా? అధర్మమా? యముడు తన సోదరియైన యమునిని భార్యగా స్వీకరించెనట— ధర్మమా? అధర్మమా? ద్రౌపదికి ఏవురు మగలట— ధర్మమా? అధర్మమా? మృతసంజీవని కొరకై కచుడు శుక్రుని మోసగించెనట— ధర్మమా? అధర్మమా? బ్రాహ్మణుడైనవసిష్ఠుడు క్షత్రియుడైన కల్మాషపాదుని పట్టపురాణితో సంగమించి ఆమెయందు పుత్రుని గాంచి ఆతని వంశము నిలువబెట్టెనట—ధర్మమా? అధర్మమా? బ్రాహ్మ

ణుడైన దీర్ఘతమసుడు క్షత్రియుడైన బలిరాజు నర్ధాంగియందు సంతానము గనుటయేగాక, ఆమె శూద్ర పరిచారికయందుగూడ సంతానము గనెనట—ధర్మమా ? అధర్మమా ? పురాణముల వరకు బోనేల ? ప్రత్యక్షముగా మన జీవితములలో దినదినము సంభవించుచున్న అనేక సంఘటనలనుగూర్చి విచారింపుడు. త్రికరణశుద్ధిగా ఎన్నిరీతుల కష్టించినను ఎన్నివిధముల యత్నించినను పట్టెడన్నము దొరకక పస్తులపై పస్తులతో ప్రాణావశిష్టుడైన దరిద్ర నారాయణు డొకడు, ప్రక్కయింటిలోని నిండు అన్నపుగిన్నెను తస్కరించుకొని పోవుచున్నాడు—ఇది ధర్మమా ? అధర్మమా ? సంఘములో ఏపనియు చేయని, మునిసిపాలిటీకి ఏపన్నులును చెల్లింపని ఒక సోమరి బైరాగి, నీవును నేనును కష్టించి ఆర్జించి పన్నులు చెల్లింపగా నేర్పడిన ఆ చక్కని కంకర బాటపై నడచిపోవుచు, ఆ నీటికొళాయిలో నీరు త్రావుచున్నాడు—ఇదిధర్మమా ? అధర్మమా ? ఎంత నిగ్రహించుకొన్నను, అంతకంతకు పొంగి పొరలిన వ్యసనోద్రేకముచే ఒక దురదృష్ట విధవ తన దేహమును అన్యాధీన మొనర్చుకొనుచున్నది—ఇది ధర్మమా ? అధర్మమా ? దైవముచే సర్వమానవుల కొరకు సృష్టింపబడిన ఈ భూమిలో కొన్ని భాగములను, 'ఇది నా అబ్బసొమ్ము' అని యాక్రమించుకొని యుండుట భూస్వాములకు ధర్మమా ? అధర్మమా ?—అయ్యలార ! శునశ్శేపుని కథ మీకు జ్ఞాపకమున్నదా ? ప్రాచీన వాఙ్మయమునందెల్ల ఆ కథ ఎంత మనోహరమో అంత విషాదకరము. అంతే కాదు—'ఇదేధర్మము—ఇదే అధర్మము. ఇదిగో ప్రమాణము—అదిగో ప్రమాణము' అనుచు జీటికి మాటికి బుడిబుడి యువన్యాసములొసంగు చిట్టిపొట్టి పండితులనోళ్ళకు అది బందుకట్టు!

ఆ కథ నిచ్చట సంగ్రహించుచున్నాము— (ఐతరేయబ్రాహ్మణము నుండి).

## 48. శునశ్శేపుని కథ

"ఇక్ష్వాకునివంశమున హరిశ్చంద్రు డను ఒక రాజు కలడు. [58] అతనికి నూర్గురు భార్యలు; కాని ఒక్క భార్య యందైన సంతతి కలుగలేదు.

105. హరిశ్చంద్రోహ వైధ స ఐక్ష్వాకో రాజా పుత్రఆస.
తస్యహ శతంజాయా బభూవు స్తాసు పుత్రం నలేభే—

అపుడు హరిశ్చంద్రుడు వరుణునిఆరాధించి "ఓ వరుణా! నీ ప్రసాదమువల్ల నాకు మగశిశువు కలిగెనేని వానినే నీకు యజ్ఞ బలిగా నర్పింతును"అని యనెను. "అట్లే యగుగాక!" అని వరుణుడనుగ్రహించెను. తత్ఫలముగ హరిశ్చంద్రునకు రోహితు డను కుమారు డుదయించెను.

106. అథైనముమవాచ వరుణం రాజానముపధావ 'పుత్రో మేజాయతాం
తేన త్వాయజా' ఇతి 'తథే'తి స వరుణం రాజాన
ముపససార. తస్యహ పుత్రోజజ్ఞే రోహితో నామ —

పుత్రోత్సవ మహానందములో మునిగి తేలుచున్న హరిశ్చంద్రు నొద్దకు వరుణుడువచ్చి 'వాగ్దానము నెరవేర్పు' మని యడిగెను. కానక కానక కన్న కొడుకును చేతులార చంపుకొనలేక, ఏదో యొక సాకుచెప్పి హరిశ్చంద్రుడు ఆ వరుణదేవుని పంపివేసెను. ఈ విధముగా ఆ వరుణుడు వచ్చుటయు, వచ్చినపుడెల్ల ఏదోయొక సాకుజెప్పి హరిశ్చంద్రు డతనిని బంపివేయుటయు కొన్ని యేండ్ల కాలము జరిగెను. ఇంతలో రోహితుడు పెద్దవాడయ్యెను. హరిశ్చంద్రు డతనిని యౌవరాజ్యమునకు అభిషేకించెను. ఇక సహింపజాలక వరుణుడు వచ్చి హరిశ్చంద్రుని జంకించి యడి

గెను. అపు డాతడు రోహితుని బిలిచి "నాయనా ! ఈ వరుణు నకు నిన్ను యజ్ఞ పశువుగా అర్పించెదనని నేను ఒడంబడితిని. నా వాగ్దానము నెరవేర్పుమా" యని ఆజ్ఞాపించెను. రోహితు డియ్యకొనక "నేను నెరవేర్పను" అని ఖండితముగా జెప్పి తన విల్లును అమ్ములను గైకొని అరణ్యములకు పోయెను.

107. ఇత్యుక్త్వా పుత్రమామన్త్రయామాస తతాయం
వై మహ్యం త్వా మదదా ద్ధన్త త్వయాహ మిమం
యజా ఇతి సహ నేత్యుక్త్వా ధనురాదా యారణ్య
ముపాతస్థౌ స సంవత్సర మరణ్యే చచార—

అనిన మాట చెల్లింపక మోసగించిన యీ హరిశ్చంద్రుని "నీవు జలోదర రోగముచే పీడింపబడెదవు గాక !" అని శపించి వరుణుడు వెడలిపోయెను.

108. అథ హైక్ష్వాకం వరుణో జగ్రాహ తస్య హోదరం జజ్ఞే—

రోహితుడు ఆరేండ్లపాటు అడవులలో సంచార మొనరించి, తుదకు అజీగర్తుడను పేరుగల ఒక మహర్షిని కలిసికొనెను. ఆ యజీగర్తుడు కడుంగడు వృద్ధుడు. అతనికి ఒక భార్యయు ముగ్గురు కొడుకులును ఉండిరి. తినుటకు అన్నము లేక ఆ కుటుంబ మంతయు శల్యావశిష్టమై మలమల మాడుచుండెను.

109. షష్ఠంసంవత్సర మరణ్యేచచార సోఽజీగర్తం సౌయవసి
మృషి మశనయాపరీత మరణ్య ఉపేయాయ తస్యహ
త్రయఃపుత్రా ఆసుః శునఃపుచ్ఛః శునఃశేపః శునోలాంగూలః—

ఆ ముగ్గురు కొడుకులలో మధ్యవానిపేరు శునశ్శేపుడు. రోహితు డజీగర్తుని జూచి "ఓ యజీగర్తా ! నీకు నూరు గోవు లొసంగె దను. ఈ నీ ముప్వురుకొడుకులలో ఒక్కనిని నాకు విక్రయింపుమా" అని యడిగెను.

110. తంహోవాచ ఋషేహం తే శతందదా
మ్యహ మేషా మేకే నాత్మానం నిష్క్రీణా ఇతి—

తండ్రికి పెద్దకొడుకుమీదను తల్లికి చిన్నకొడుకుమీదను ప్రీతి యగ్గలమని కదా లోకోక్తి! కాబట్టి పెద్ద కొడుకును బిగ్గ కౌగిలించుకొని "నాయనా! నిన్ను విడజాలను!" అని తండ్రి యేడ్చెను. చిన్న కొడుకును బిగ్గ కౌగిలించుకొని "నాయనా! నిన్ను విడజాలను" అని తల్లి యేడ్చెను. తుదకు ఇరువురు కలిసి మధ్యవానిని — అనగా శునశ్శేపుని — రోహితునకు విక్ర యించిరి.

111. స జ్యేష్టంపుత్ర నిగృహ్ణాన ఉవాచ నన్విమ మితి
నోఏవ మితి కనిష్ఠం మాతా తౌహమధ్యమే
సంపాదయాంచక్రతుః శునఃశేపే—

శునశ్శేపసహితుడై రోహితుడు తండ్రివద్దకు వచ్చెను. హరిశ్చంద్రుడు వరుణుని బిలిచి "ఓ వరుణా! నా కొడుకునకు బదులు ఈ బుడుతను బలి యొసంగెద—నీకు అంగీకారమా?" అని యడిగెను. "క్షత్రియుని కంటె బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు—కాన నా కంగీకారమే" యని వరుణుడు చెప్పెను.

112. సపితర మేత్యోవాచ తత హంతాహమనేనా
త్మానం నిష్క్రీణా ఇతి స వరుణం రాజాన
ముపససా రానేన త్వాయజా ఇతి తథేతి
భూయాన్వై బ్రాహ్మణః క్షత్రియా దితి వరుణ ఉవాచ—

బలియజ్ఞము ప్రారంభమయ్యెను. దానికి విశ్వామిత్రుడు హోతగా నిల్చెను—జమదగ్ని అధ్వర్యుడు—వసిష్ఠుడు—బ్రహ్మ—అయాస్యుడు ఉద్గాత—

113. తస్యహ విశ్వామిత్రో హోతాసీ జ్జమదగ్నిరధ్వర్యు
ర్వశిష్ఠో బ్రహ్మా యాస్య ఉద్గాత—

ఆ దురదృష్ట శునశ్శేఫుడు మంత్రాదులచే యథావిధిగ సంస్క-రింపబడినవాడై యజ్ఞశాలకు తేబడెను—కాని, ఆ బుడుతను బలిస్తంభమునకు గట్టుటకై ఒక్కడైన సాహసింప కుండెను. అపుడు అజీగర్తుడే ముందుకువచ్చి [29] "ఇంకొక నూరుగోవు లొసంగినచో నేనే ఆ పనిచేసెదను" అని చెప్పెను. హరిశ్చంద్రు డంగీకరించి అతనికి మరొకనూరు గోవు లొసంగెను. అపుడు అజీగర్తుడు చేతులార తన కుమారుని ఆ బలిస్తంభమునకు గట్టివైచెను.

114. తస్మై హోపాకృతాయ నియోక్తారం న వివిదుః
స హోవాచాజీగర్తః సౌయవసిర్మహ్య మపరం
శతం దత్తాహమేనం నియోక్ష్యామీతి తస్మా
అపరంశతందదుస్తం స నినియోజ—

కాని, మరల ఒక్కడైన ఆ బొట్టెను వధించుపనికి ఒడంబడ డయ్యె. అపుడు, మరొక నూరుగోవులొసంగిన యెడల ఆ పనిని కూడ తానే చేయుదునని అజీగర్తుడు మరల చెప్పెను. హరిశ్చంద్రు డాతనికి మరొక నూరు గోవు లొసంగెను.

115. తస్మై నియుక్తాయ విశసితారం న వివిదుః
స హోవాచాజీగర్తః సౌయవసిర్మహ్య మపరం
శతం దత్తాహమేనం విశసిష్యామీతి తస్మా
అపరం శతం దదుః—

మరొక నూరు గోవులు స్వీకరించిన ఆ యజీగర్తుడు, కత్తి నూరుచు కొడుకును సమీపించెను. "అయ్యో! వీరు నిజముగా నన్ను బలిగొందురుకాబోలు! ఓ దేవతలార! మీరైన నన్ను రక్షింపుడు" అనుచు ఆ దైవోపహతడు ఒక్కొక్క వేల్పును పేరుబెట్టి పిలువ నారంభించెను—

116. తస్మా అపకం శత నదుః సోఽపిం గిఃరాం
ఏయా యాఽకశా ... శ్రేష్ఠా ...
మానుషేషు ... సేష్వంతి ...
దేవతా ఉపధావ ఇతి—

అతని యార్తనాదమును వేల్పులెల్లరును వినియు ఒక్కరైన అడ్డు పడక మిన్నకుండిరి. తుదకు ఉష యను దేవత ఆ బాలునిపై కరుణ వహించెను. ఆ దేవత యనుగ్రహము వలన అతని పాశములు శకలశకలము లగుటయేగాక, హరిశ్చంద్రుని పీడించుచున్న జలోదరరోగముకూడ ఆ క్షణమే మాయమైపోయెను.

117. స ఉష సంతుష్టావ ఉత్తరేణ తృచేన తస్యహ
స్మర్చ్యృచ్యుక్తాయా విపాశో ముముచే కనీయ
ఐక్ష్వాకస్యోదరం భవ త్యుత్తమస్యామేవ
ర్చ్యుక్తాయాం విపాశో ముముచేఽగద
ఐక్ష్వాక ఆస— [ఐ. (బ్రా]

సదస్యులెల్లరు ఆశ్చర్యచకితులైరి. శునశ్శేపుని కొనియాడి దీవించిరి. అంతేకాదు—అతనినే హోతగా నియోగించి ఆ యజ్ఞమును (బలిలేకుండ) పూర్తిగావించిరి. ఇపుడు అజీగర్తునకు తన కొడుకుమీద మరల ఆసకలిగి అతనిని తనవెంట గొనిపోవుటకు ఉద్యమించెను. కాని ఆ నిర్దయునివెంబడి పోవుటకు శునశ్శేపుడు నిరాకరించి అచటి సదస్యుల శరణు జొచ్చెను. వారిలో, విశ్వామిత్రునకు ఆతనియందు గాఢమగు సానుభూతి కలిగి, వానిని తన యండకు చేరదీసి- 'దేవరాతు' డను క్రొత్తపేరుపెట్టి దత్తపుత్రునిగా స్వీకరించెను." ఇది కథాసంగ్రహము. ఇందలి సంఘటనలు అపూర్వములేకాదు— అమానుషములు. వీనిలో ఏదిధర్మము ? ఏది యధర్మము ? కడుపుతీపికి అగ్గమైన హరిశ్చంద్రుడు వరుణుని గికరింపజూచుట ధర్మమా—అధర్మమా ?

ప్రాణమునందలి ప్రీతిచే రోహితుడు తండ్రియాజ్ఞను ధిక్కరించి పోవుట ధర్మమా—అధర్మమా? ఆకడ కృశించుచున్న అజీగర్తుడు కొడుకును అమ్ముకొనుట ధర్మమా—అధర్మమా? హరిశ్చంద్రుడు తన కొడుకునకు బదులు మరొకని కొడుకును బలియొసంగ బూనుట ధర్మమా—అధర్మమా? తాను తొలుదొల్త నంగీకరించిన రోహితునిగాక, వానిస్థానే, మరొకనిని కబళింపబూనుట వరుణునకు ధర్మమా—అధర్మమా? తుదకు అజీగర్తుడు పిలువగా అతనివెంట బోవక ఎదురించుట శునశ్శేపునకు ధర్మమా—అధర్మమా? అజీగర్తుని యంగీకారము లేకుండ విశ్వామిత్రుడు శునశ్శేపుని పెంచుకొనుట ధర్మమా—అధర్మమా?—ఇందలి ఒక్కొక్క సంఘటనను ఒక వేయిమంది "ఒప్పు" అని సమర్థించినచో మరొక వేయిమంది "తప్పు" అని ఖండించుటకు అవకాశమున్నది. 'సత్యాన్నాస్తిపరోధర్మః' [30] అని యందుమా హరిశ్చంద్రుడు వరుణుని మోసగింపజూచుట అధర్మమే—లేక 'అపుత్రస్య గతిర్నాస్తి' [31] అని యందుమా ఏ యబద్ధమాడియో కొడుకును కాపాడుకొన జూచుట ధర్మమే! 'యయా కయాచ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్' [32] అని యందుమా అజీగర్తుని పుత్రవిక్రయము ధర్మమే—లేక 'ఆత్మవత్సర్వభూతాని' [33] యందుమా అజీగర్తునిది అధర్మమే! 'శరీరమాంద్యఖలు ధర్మసాధనం' [34] అని యందుమా రోహితుడు స్వప్రాణ రక్షణమునకై తండ్రిని ధిక్కరించి పోవుట ధర్మమే—లేక 'పితృదేవోభవ' [35] అని యందుమా రోహితుని పిత్రాజ్ఞోల్లంఘనము అధర్మమే!—మరి, ఏది ధర్మము? ఏది అధర్మము? రెండును ధర్మములగునా? లేక రెండును అధర్మము లగునా? లేక రెండును కొంత కొంత ధర్మములును,

గొంత కొంత అధర్మములును అగునా? అసంభవము. ¼ పాతిక ధర్మము, సగము అధర్మము, ముప్పాతిక ధర్మము—అని గుణించుటకు ధర్మము గణమానముకాదు. ధర్మము అవిభాజ్యము. అయినచో ధర్మము—లేనిచో అధర్మము అంతే.

118. ద్వావేవ వైదికమ్ న తృతీయమస్తి సత్యంచైవానృతమ్— [శర]

మరి ఏది ధర్మము? ఏది అధర్మము?

## 49. ధర్మాధర్మ సమస్య

అయ్యలార! మన 'వైదికధర్మోద్ధార'కులకు మంచినీళ్ళ ప్రాయముగా కన్పించుచున్న ఈ భయంకర ధర్మసమస్యను మన ప్రాచీన మహర్షులు తమ సునిశిత ప్రతిభతో తమ ప్రశాంత భావనతో తమ యమోఘ విజ్ఞానముతో తర్కించి తర్కించి, శోధించి శోధించి, త్రవ్వి త్రవ్వి తుదకు అంతుపొంతు తెలియక, తలలు వేడిమెక్కి, తమ కడపటి యభిప్రాయమును మనకు విస్పష్టముగా సెరింగించి యున్నారు. వ్యాసుడు చెప్పచున్నాడు—

1.9. నైవధర్మీ నచాధర్మీ న చైవ హి శుభాశుభీ
యస్స్యాత్ దేశాసనేలీన స్తూష్ణీమ్ కించిదచింతయన్— (మ, భా)

"ఓ మానవులారా! ప్రశాంతమైన స్థలములో ఒంటరిగా కూరుచుండి కొంచెము దీర్ఘయోజనచేసి చూడగా నాకు అన్నియు ధర్మములుగానే దోచుచున్నవి. కాని మరొక్కింత దీర్ఘయోజనచేసి చూడగా, మరల అవి అన్నియు అధర్మములుగానే తోచుచున్నవి"—అంతేకాదు—ఇంకను వినండి!

120. నచదేవా న పితరో మునయో నచమానవాః
అయంధర్మో హ్యయం నేతి బ్రువంత్యభిన్నదర్శనాః—
[వాయు 59—23]
తస్మాన్ననిశ్చయాద్వక్తుం ధర్మః శక్యస్తు కేనచిత్— [శతపథ]

మానవులే కాదు, మహర్షులేకాదు, పితరులేకాదు, దేవతలే కాదు, ఎవ్వరైననసరే ధర్మాధర్మనిర్ణయమందు భిన్న భిన్న దృష్టిలో వర్తించుట తప్పదు—ధర్మనిర్ణయము ఏ ఒక్కనికిని అశక్యము.

## 50. "ధర్మ" నిర్వచనము

తొలుదొల్త "ధర్మ" శబ్దమునకు అర్థమేమో తెలిసి కొందము. శంకరభగవత్పాదులు సెలవిచ్చుచున్నారు—

121\. ప్రాణినాం సాక్షా దభ్యుదయనిశ్శ్రేయస
హేతు ర్య స్సధర్మః— [గీ. భా]

'ఎయ్యది ప్రాణికోటికి అభ్యుదయకారకమో, క్షేమదాయకమో అదియే ధర్మము'. వ్యాసుడు చెప్పుచున్నాడు—

122\. ధారణాత్ ధృతి రిత్యర్థాత్ ధాతో ర్ధర్మః ప్రకీర్తితః
అధారణోఽమహత్త్వేచ అధర్మ ఇతిచోచ్యతే— [వాయు]

123\. ధారణాత్ ధర్మ మిత్యాహుః ధర్మేణ విధృతాః ప్రజాః
యత్ స్యాత్ ధర్మసంయుక్తః స ధర్మఇతినిశ్చయః— (మ. భా)

'ధర్మ' శబ్దము 'ధృఞ్' అను ధాతువువలన జనించినది. 'ధృఞ్' ధాతువునకు 'ధరించుట' 'పోషించుట' అని యర్థములు. కాబట్టి 'ధర్మ' మనగా 'ధరిం'చునది 'పోషిం'చునది యని అర్థము. 'ధరిం'చుట దేనిని ? ప్రజాసమూహమును. అనగా ? మానవుని భౌతికదేహమును వస్త్రాదు లెట్లు ధరించుచున్నవో అతని నైతిక దేహమును ధర్మ మట్లు ధరించుచున్నది. కాబట్టి ఎయ్యది ప్రజాసమూహమును లెస్సగా 'ధారణ' చేయ గలుగునో అదియే 'ధర్మ' మనుట నిశ్చయము. వ్యాసుడింకను చెప్పుచున్నాడు—

124\. ప్రభవార్థాయ భూతానాం ధర్మప్రవచనం కృతం
యత్ స్యాత్ ప్రభవసంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః- [మ.భా]

"ప్రాణికోటి పురోవృద్ధికొరకు ధర్మముద్దేశింపబడినది. కాబట్టి ఎయ్యది ఆ పురోవృద్ధిని సమకూర్పజాలునో అదే ధర్మ మనుట నిశ్చయము." అంతేకాదు—ఇంకను—

125. అహింసార్థాయ భూతానాం ధరప్రవచనం కృతం
యత్ స్యాదహింసయా యుక్తః స ధర్మ ఇతి నిశ్చయః-[మ.భా]

"ప్రాణికోటిలో అహింసకొరకు ధర్మముద్దేశింపబడినది. కాబట్టి ఎయ్యది అహింసాయుక్తమో అదియే ధర్మమనుట నిశ్చయము." ఇంకను—

126. సర్వేషాం యః సుహృన్నిత్యం సర్వేషాంచ హితేరతః
కర్మణా మనసా వాచా స ధర్మ వేదజాయతే- [మ. భా]

"సర్వమానవులకు త్రికరణశుద్ధిగా ఏది అన్యోన్యతను (సుహృద్భావమును) సంఘటింపజాలునో, ఏది సర్వమానవులకు హితమును సమకూర్పజాలునో, అదియే ధర్మమనుట నిశ్చయము." కాబట్టి ధర్మలక్షణము లెట్టివనగా పురోవృద్ధి—అహింస—అన్యోన్యత—హితము. మంచిదే— కాని ఏది పురోవృద్ధికరము? ఏది అహింసాయుక్తము? ఏది అన్యోన్యతాసాధకము? ఏది హితపూర్వకము? వ్యాసుని అమోఘవాక్యమువినండి !—

127. ధర్మాధర్మౌ విప్రప్రోక్తౌ శబ్దావేతౌ క్రియాత్మకౌ
కుశలాకుశలం కర్మ ధర్మాధర్మౌ వితిస్మృతౌ- [వాయు]

"ధర్మము అధర్మము అను రెండును క్రియాత్మకములు. ఆక్రియలకు ఫలితములు కుశలము అకుశలము అను రెండు కర్మలు. దేనిని ఆచరించుటవలన కుశలము కలుగునో ఆక్రియయేధర్మము. దేనిని ఆచరించుట వలన అకుశలము కలుగునో ఆ క్రియయే అధర్మము" తాతా! వ్యాస! సర్వధర్మసారసంగ్రహమైన ఇట్టి ప్రవచనము నీకే వ్యక్తవ్యముకదా!

## 51. కొలతబద్ద

ఈ ప్రవచనము ననుసరించి ఇక నిపుడు సనాతనధర్మ ములను పరీక్షించి చూతము. అహింస—ఇది సనాతనధర్మమే. కాని క్రియారూపమున ఈ అహింస ఒక్కొక్కప్పుడు అనాచరణీయ మగు చున్నది. ఉదాహరణము:— నిరపరాధినైన నామీదికి ఒకహంతకుడు ఖడ్గహస్తుడై లఘించుచున్నాడు. నా కర్తవ్యమేమి? అహింసను ఆచరించి ఆ హంతకుని కత్తికి ఆహారమగుటయా? లేక హింసాహింసల చర్చను పండితులకు విడచి, మంచిబడితెను చేదాల్చి వాని నెదుర్కొనుటయా? మనువు చెప్పుచున్నాడు—

128. గురుంవా బాలవృద్ధౌవా బ్రాహ్మణంవా బహుశ్రుతమ్
ఆతతాయిన మాయాంతం హన్యాదేవాఽవిచారయన్ ॥ [మను, 8-350]

"ఓయీ! నిన్ను చంపుటకు ఆతతాయి వచ్చినయెడల తెల్ల మొగము వేయవద్దు! లే! తిరిగి కొట్టు! అవసరమైన చంపు! ఆ ఆతతాయి బాలుడు కానిమ్ము—వృద్ధుడుగానిమ్ము—గురువు గానిమ్ము—తుదకు బ్రహ్మనోటినుండి యూడిపడిన బ్రాహ్మణుడు కానిమ్ము. తడబడవద్దు! తాడించు! తాడించు!" కాబట్టి, ఇచ్చట ధర్మము ప్రధానముకాదు—మానవుని ప్రాణరక్షణ, ప్రధానము. కాబట్టి, ధర్మమును బ్రతికించుట కొరకు మానవుడు జనింపలేదు. మానవుని బ్రతుకును తీర్చి దిద్దుటకై ధర్మము ఏర్పరింపబడినది. కాబట్టి అహింస అహింస కావచ్చు—సత్యము సత్యముకావచ్చు—లేక మరెట్టి సనాతనధర్మమైన మహోత్తర ధర్మమని ప్రశంసింపబడవచ్చు—కాని అవి 'క్రియా' రూపమున 'కుశల' కర్మలుగా ఫలించునంత మేరకే, ధర్మములు.

ఉత్తరక్షణము నుండి అధర్మములు—అందువలన త్యాజ్యములు. ధర్మపరిమాణమునను ఇదిగదా కొలతబద్ద !

## 52. కొలత

ఈ మానదండముతో ఇక మన చాతుర్వర్ణ్యధర్మమును, అస్పృశ్యతాధర్మమును (అధర్మమును !) పరిశీలించి చూతము. మన శాస్త్రముల ప్రకారము ఈ చాతుర్వర్ణ్యము కృతయుగములో లేదట—త్రేతలో ప్రారంభమై ద్వాపరమున విస్తరించి కలిలో పరిపక్వమైనదట. అస్పృశ్యతమాత్రము పూర్తిగా కలి బిడ్డయే! మరి, పెక్కు శతాబ్దములనుండి మన సంఘమును పాలించుచున్న ఈ ధర్మములు, 'క్రియా' రూపమున నేడెట్టి 'కుశలా కుశల' ఫలితముల నొసంగుచున్నవి? హిందువుడా! ఈ భారతభూమి సర్వస్వము ఎంతకాలము హిందువుని ఏకైక నిర్భిన్న శాసనమం దుండెనో, ఎంతకాలము ఈ భూమి హింద్వేతర జాతులకు దుర్నిరీక్ష్యమై యుండెనో అంతకాలము ఈ చాతుర్వర్ణ్యము వలన హాని కనుపించలేదు. ఏలయన, నీ ఇల్లు నీ యధీనమునం దుండెను. మంచి సంసారివలె నీ యింటిపనులను నీ నలువురు సోదరులకు చక్కగా పంచియిచ్చినావు. ఒకనిని పని పాటలయందు నియోగించినావు—ఒకనిని కృషివాణిజ్యములందు నియోగించినావు—ఒకనిని గృహరక్షణమునందు నియోగించినావు—ఒకనిని విద్యాగురువుగా నియోగించినావు. ఈ విభజనము సమంజసమే యని ఒప్పుకొందము. ఇది పెక్కండ్లు—అనగా నీయిల్లు నీ యాజమాన్యములో నున్నంతమేరకు—నీకు ఉపకరించి యుండవచ్చునని కూడ అంగీకరింతము. కాని అనంతర మొకప్పుడు ఏమి సంభవించెను? గ్రీకులు, శకులు, బర్బరులు, యవనులు, పారశీకులు, తురుష్కులు మొదలగు

ఖండాంతరజాతులు నీ యింటిమీదికి పరాక్రమించినవి. గృహ రక్షణమునకై నీవు ప్రత్యేకముగా నియోగించిన నీ రెండవ తమ్ముడు, తలప్రాణము తోకకువచ్చునందాక పోరిపోరి చివరకు తన కత్తిపై నత్తమిల్లెను. పెద్దవా డేమిచేయుచుండెను? జ్ఞానము ముదురుటచేత అతని దృష్టి ఆకాశపరీక్షలో అంతర్థానమై భూలక్ష్యములమీద నిలువదయ్యెను. మూడవవాడో? అతనికి త్రాసునందును నాగలియందునుగల విన్ననువు, శస్త్రనిర్వాపణ మునందు లేదయ్యెను. నాల్గవవాడో? 'నమోబ్రహ్మణే!' యను మంత్రమును అతనిచే చదివించి చదివించి, ఒక 'నమస్తే యంత్రము'గా అతనిని నీవే నిర్మించిపెట్టితివి! ఫలితము? పరాధీనత. నీవు, నీ యిల్లు, నీ వారందరును పరాధీనులైరి. నీ వ్యవహారము నీ హస్తములనుండి స్రస్తమయ్యెను.

## 53. భల్లూక ముష్టి

అయ్యలార! హస్తమునకు వ్రేళ్లు అయిదు. మాట వరు నకు— బొటనవ్రేలు బ్రాహ్మణుడనియు, చూపుడు వ్రేలు క్షత్రియుడనియు, నడిమివ్రేలు వైశ్యుడనియు, నాల్గవవ్రేలు శూద్రుడనియు, చిటికినవ్రేలు చిన్ని అస్పృశ్యుడనియు అనుకొందము. ఈ అయిదువ్రేళ్లలో నొక్కొక్కటి వ్యక్తిగతముగా దుర్బలము. కాని అయిదింటిని కలిపి నిలుపండి—చపేటము సిద్ధము! ఏక ముఖముగా వంచి కలుపండి—గుప్పిలి సిద్ధము! ఇంకను వంచి బిగించండి—ముష్టి! భల్లూక ముష్టి!

## 54. వానరవంశము

అయ్యలార! ఈ ప్రపంచము ఒక కర్కశ పాఠశాల. ఇందుగల న్యాయములు ఇనుకపాతరలు. కాని ఆ న్యాయము

లన్నింటిలో విజయవంతమైన న్యాయముగా ఒక్కటే కన్పించు చున్నది—జబ్బవుష్టి న్యాయము. ఇందుగల జాతులు అసంఖ్యాకములు. కాని ముఖ్యమైన జాతులు రెండే కన్పించుచున్నవి—కలవారు, లేనివారు. ఈ అసహజ వ్యవస్థను సంస్కరించుటకై గాంధిమహాత్మునికన్న ఘనులైనవారు దీనిలో ఎందరో పుట్టిగిట్టినారట. శ్రీకృష్ణునివంటి ధర్మసంస్థాపకుడు, బుద్ధునివంటి పరమ దయాళువు, క్రీస్తువంటి ప్రేమావతారుడు, మహమ్మదు వంటి తీవ్ర సంస్కర్త, యుగయుగములం దొక్కొక్కరు ప్రభవించి, ఈ మానవజాతి వంకలు తీర్చి దిద్దుటకై, అనంతమైన శ్రమచేసినారట. ఫలితము? యథాతథము. హింస! హింస! గీత 'సుధ'ను త్రావి పార్థుడు కైపెక్కి, చుట్టపక్కముల గొంతుకలు చురచుర గోసెను. హింస! పదునే డక్షౌహిణీల భారత పుత్రులు 'స్వర్గ'మునకు బోయి 'రంభాసంభోగ సౌఖ్య'ము లనుభవించినారట! ఈ హింసయంతయు 'ధర్మస్థాపన' కట! ఇక 'ఖురాను'కు ఫలిత మేమి? అల్లాయుద్దీను మొదలుకొని ఔరంగజేబు వరకు గల చక్రవర్తులు ఇస్లామేతరులమైన మన వంటి 'కాఫి'రుల కుత్తుకలు కోసి కోసి గుట్టలు పేర్చినారు—హింస! ఈ హింసయంతయు దేనికట? 'సత్యమతస్థాపన' కట! ఇక 'బైబిలు'నకు ఫలిత మేమి? అదిగో! అదిగో! చూడండి—రక్త రక్తిమారంజితమైయున్న ప్రతీచీ దిశావదనము! అదిగో! వినండి—ఆ దెసనుండి వీతెంచుచున్న వృద్ధుల రోదనము! విధవల హాహాకారము! అనాథ బాలబాలికల యాక్రందనము! చూడండి — నెత్తిమీదుగా ఎగిరిపోవుచున్నవి క్రొత్తరకపు టాకాశ పిశాచములు! నేలపై ప్రాకిపోవుచున్నవి భీకాళ శతఘ్నులు! నీటిలో పొంచియున్నవి భయంకర మహానాగములు!

చూడండి—నిన్నటి పట్టణము నేడు శ్మశానము ! నిన్న కలకల లాడిన కేదారక్షేత్రము, నేడు వలవలని భస్మరాశి !... ఆహాహా! 'గీత' కు ఫలితము భారతయుద్ధము. 'ఖురాను'కు ఫలితము 'జిహాద్' (ధర్మ) యుద్ధము. 'బైబి'లుకు ఫలితము జోడుప్రపంచ మహాసంగ్రామములు. తత్పూర్వము లసంఖ్యాకములు. మరి, 'గీత' యనగా నెట్టిది? ఓహోహో! దానివిలువ ఇంతని చెప్ప దరమా !—బైబిలో ? బాపురే ! ఒక్కొక్క సూక్తి ఒక్కొక్క కోహినూర్ !—ఖురానో ? శెబాస్ ! ఎత్తు కెత్తు బంగారము ! మరి—నరుడో ?—నరుని వంశకర్త వానరు డట కదా !

## 55. దేగలు ! దేగలు !

అయ్యలార ! భూమి పరిమితము—కాని భూమియందు దినదిన ప్రవృద్ధమగుచున్న జనసంఖ్య అపరిమితము. సంఖ్య హెచ్చినకొలది జీవిత సంగ్రామము తీవ్రతర తీవ్రతమరూపము లను ధరించుట సహజము. మరి—

"ఓ జీవుడా ! నీకు ముఖ్యముగా కావలసిన వస్తువేమి ?"

"అన్నము ! అన్నము !"

129 అహమన్న మహమన్న మహ
మన్నాదో ఽహమన్నాదో— [తై—౯,7—10]

"ఎందుచేతనయ్యా ఇంత అన్నాతురత నీకు ?"

"ఆకలి ముందు—తర్వాత నేను ! ఇది నా జన్మ రహస్యము—అందుచేత."

"నిజమా ?"

"అయితే, విను నా స్వీయచరిత్ర. ఆత్మవలన ఆకాశము జనించెను—ఆకాశమువలన వాయువు—దానికి అగ్ని—దానికి నీరు—దానికి పృథివి—పృథివికి ఓషధులు—

ఓషధులకు అన్నము—అన్నమునకు నేను ! విన్నావా !
ముందు అన్నము—తర్వాత నేను ! అయ్యయ్యో !
ఆకలి ! ఆకలి ! అన్నము ! అన్నము ! ”—

130. ఆత్మన ఆకాశః సంభూతః - ఆకాశాద్వాయుః -
వాయోరగ్నిః - అగ్నేరాపః - అద్భ్యః పృథివీ -
పృథివ్యా ఓషధయః - ఓషధీభ్యోఽన్నమ్ - అన్నా
త్పురుషః-స వా ఏష పురుషోఽన్నరసమయః—

[తై-ఉ, 2, 1—2]

“ నీ యాకలితీరని ఘట్టము ఒకానొకప్పుడు తటస్థించినచో
ఏమి చేయుదువు ? ”

“ ఏమిచేయుదునా ? హుం ! జాగ్రత ! నేను చేయజాలని
ఘోరకృత్యము లేదు ! ” —

131. ‘బుభుక్షితః కిం న కరోతి కర్మ ? ’

“ అయ్యయ్యో ! ధర్మము అధర్మము అను విచారము నీకు
వలదా ? ” —

“ ధర్మము ? హిహిహి ! ముందు నా ఆకలి — తర్వాత
నీ ధర్మము ! ”—

132. రక్షేదేవ స్వదేహం పశ్చాద్ధర్మమ్ సమాశ్రయేత్ - [పరా]

“ జేనెడు కడుపు నెపల ఇంత సుఖలోభము నీకుతగునా?”-

“ నా కొక్కనికేనా ! నీకు ? వారికి ? సర్వులకు? హిహిహి!
లోకమంతయు సుఖలుబ్ధము ”—

133. సుఖాయ కర్మాణి కరోతి లోకః— [భాగ]

ఇది, జీవి జీవితరహస్యము. ఆకలి, అన్నము. మరి, అయ్యలార!
పరిమితమైన భూభాగమునందు అపరిమితమైన జనసంఖ్య
ఉత్పన్నమగుచుండగా ఆహారము కఱవగుటయు, ఆకలి తీరక

పోవుటయు తప్పక సంభవించును. అపుడే భయంకర సంఘర్షణ. అపుడే పరస్పర మారణహోమము. అపుడే బలవంతుల విజృంభణము—బలహీనులహింస. అపుడు అన్నిధర్మములును రద్దు. ఒక్కధర్మమే మిగులు— ఆ ధర్మము పేరు? పేరా?—శునక విస్తరి ధర్మము. ఒకవిస్తరి—అనేక శునకములు! అయ్యలార! కఠోరమగు నిట్టి నిత్యజీవన మహాసంగ్రామములో కమలభక్షకులకు తావు లేదు. బొత్తుగా లేదు. ఏజాతి, తినయిల్లు దిద్దికొని, నడుమునకు కాసె బిగించి, మంచి దుడ్డుగఱ్ఱ చేదాల్చి, మంచె యెక్కి, తలయెల్ల కనులుగా దశదిశలు పరికింపకుండునో, ఆ జాతి యన్నమును ఏ డేగలో ఎగురదన్నుకొని పోవుట ప్రకృతి ధర్మము.

134. 'జీవో జీవస్య జీవనమ్' [37] [భాగ, 1, 13-46]

## 56. ఫలితము

అయ్యలారా! ఈ ప్రాచీన భారతఖండము పంచమహాఖండములకు గురుపీఠము. ఇతరఖండములవారు అజ్ఞానాంధకారమున మునింగి పశుప్రాయులై సంచరించిన కాలమందు ఈ ఖండమంతయు 'తత్త్వమసి' [38] 'అహం బ్రహ్మాస్మి' 'ఏకమేవాద్వితీయం' [39] అను దివ్యఘోషలతో మారుమ్రోగినది. అది మహర్షులయుగము ... ... ... ఆ యుగ మంతరించినది. వారి యొరసులైన మీరు తదాదిగా నేటివఱకును మీయుగము సాగించియున్నారు. చాతుర్వర్ణ్య సమోపేతమైన ఈ అశేష భారత మహాసంఘమున కంతటికి, ఆ మహర్షుల యనంతరమున మీరే విద్యాగురువులరు—మీరే ధర్మాచార్యులరు— మీరే నీతిబోధకులరు— మీరే మార్గదర్శకులరు. మరి, మీ గురుత్వమునకు నేడు కన్పించుచున్న ఫలితము లెవ్వి? సంఘీభావ

సాహిత్యము—రాజకీయ నిస్సహాయత్వము—నైతిక అస్థిరత్వము—ఆర్థిక దారిద్ర్యము—దైహిక దౌర్బల్యము—ఇవి, ఫలితములు.

## 57. ఎవరు బాధ్యులు?

ఈ ఫలితములకు ఎవరు బాధ్యులు? శాస్త్రదండములను ఝుళిపించుచు, ఎవ్వరు తరతరములనుండి ఈ ప్రాచీనజాతిని గొఱ్ఱెలమందవలె నడిపించియున్నారో వారే ఈ ఫలితములకు బాధ్యులు. అయ్యలారా! ఆ శతాబ్దములు గతించినవి—నేడు క్రొత్తశకము ప్రారంభమైనది. ఈ శకమునందు కులమునుబట్టి కాదు ఆచార్యత్వము—గుణమును బట్టి; వర్ణమునుబట్టికాదు గౌరవము—వర్తనమును బట్టి.

135. పండితస్యాపి శూద్రస్య శాస్త్రజ్ఞానరతస్య చ
వచనం తస్య నగ్రాహ్యమ్ శునోచ్ఛిష్టం హవి ర్యథా— [చ.విం]

అనగా—"హోమమునందు పోయు నాజ్యము ఎట్టి పవిత్రవస్తువైనను, కుక్క ముట్టెనేని అపరిగ్రాహ్యమగుచున్నది. అట్లే, శూద్రు డెన్నిశాస్త్రములు చదివి ఎంతపండితుడైనను అతని పాండిత్యము అనాదరణీయము"— ఈసూక్తి ఆచరణాభావముచే నేడు అనంతస్మృతిపథమును బట్టినది. మరియు—

136. దుశ్శీలోపి ద్విజః పూజ్యో న శూద్రో విజితేంద్రియః
కః పరిత్యజ్య గాం దుష్టాం దుహ్యేత్ శీలవతీం ఖరీమ్ [పరా]

అనగా—"ఎంత దుష్టుడైనను ద్విజుడే పూజ్యుడు. ఎంత జితేంద్రియుడైనను శూద్రుడు పూజ్యుడుకాడు. ఎంతపొగరుబోతుదైనను ఆవుపాలే పూజ్యములు గాని, గాడిదపాలు పూజ్యములు కాదుగదా" అని చెప్పిన పరాశరసూక్తికూడ నేడు కాలగోమము సోకి పెంటప్రోగున కెక్కినది.

## 58. కర్తవ్యము

'సనాతన ధర్మోద్ధార' కులారా! శాస్త్రోక్తమైన సనాతన ధర్మమును నేడు మన మాచరింపజాలని కారణముచేత, మన మెల్లరము 'ధర్మచ్యుతు'లమైతి మనియు, 'వర్ణసంక'రుల మైతి మనియు శంకించి, పరితపించి, ఏదో పరమ దారుణపాతక మొనర్చిన పాషండ పాతకుల వలె లజ్జించి, తలలు వంచుకొనవలెనా? పిఱికిపందలు ఆపనినే చేయుచున్నారు. కాని, ఎయ్యది మీకు 'ధర్మపతనము' 'వర్ణసంకరము' అను స్వరూపమున సింహస్వప్నముగా తోచుచున్నదో, అదియే మాకు 'నవజీవనము' 'సర్వమానవ సమానత్వము' అను స్వరూపమున నవ్యసుందరదృశ్యమై కన్పించుచున్నది. దేనిని 'కలి'యని మీరు పెదవులు విఱుచుచున్నారో దానియందే 'స్వర్గ'మును సాధించుట మా ఆశయము. మీలో మాలోగల ఈదృష్టి భేదము సులభగ్రాహ్యము. మీదృష్టిలోమానవుడు ప్రాచీనధర్మబద్ధుడు-మా దృష్టిలో మానవుడు నిత్యవినూత్న ధర్మవ్యవస్థాపకుడు. మీ మానవునకు శాస్త్రమే ప్రపంచము—మా మానవునకు జీవనమే శాస్త్రము. అయ్యలార! ఈ శాస్త్రములు రావచ్చును-ఈ శాస్త్రములు పోవచ్చును. కాని మానవజాతి యొకటి మాత్రము సుస్థిరము. శాస్త్రములందలి యక్షరములు, నాటికిని నేటికిని, స్థాణురూపమున అట్లే నిలిచియుండవచ్చును—కాని మానవజాతి జీవయాత్రలో ఎప్పటి కప్పుడు ఎన్నియో పరిణామములు దశాంతరములు అవస్థా భేదములు సంభవించుచునే యుండును. శాస్త్రములు ఒకటవ మైలురాతియొద్ద అట్లే నిలిచియుండగా,మానవజాతి మనోభావములు,కర్మధర్మములు,ఆచార వ్యవహారములు క్రొంగ్రొత్త దారులలో సంచరించుచు వినూత్న

సమస్యల నెదుర్కొనుచు వందలకొలది మైళ్లు ముస్ముందుకు సాగిపోవుచునే యున్నవి. మరి—అట్టి మానవజాతిని ఆ వందల కొలది మైళ్ళు మరల వెనుకకు నడిపించుట శ్రేయస్కరమా? లేక అది నడిచిపోవుచున్న దారిలోని చెత్త చెదారముల నూడ్చి దాని మార్గమును మరింత సుగమముగా నొనర్చి, దాని నడకను మరింత సుకరముగా జేసి, దానిని జయ జయ ధ్వానములతో ముస్ముందుకు నడిపించుకొని పోవుట శ్రేయస్కరమా?

## 59. స్వస్తి

అయ్యలారా! మన శాస్త్రములందు ఎంతటి మహోన్నతాశయములు ప్రతిపాదింపబడి యున్నవో అంతటి అత్యధమ ధర్మములు కూడ ప్రవచింపబడి యున్నవి. మహోన్నతాశయములైన బ్రహ్మచర్యాది యాశ్రమములును శమదమాది సాత్త్విక లక్షణములును నేడు మన కసాధ్యము లగుటచే వానిని విసర్జించితిమి. వానిని విసర్జించుటచే సనాతన ధర్మమునకు విపర్యాసము ప్రాపించినది. ఆ విపర్యాసమునకు ఫలితముగా, నేడు, ఆ ప్రాచీనశాస్త్రశక్తికంటె ఊర్జస్వలమైన నవ్యసాంఘిక మహాశక్తి యొకటి యుత్పన్నమై, మన సనాతనధార్మికవ్యవస్థ నంతయు నూకటివ్రేళ్ళతో గదలించి యుఱ్ఱూత లూగించుచున్నది. ఈ ప్రచండ విప్లవమునకు ఫలముగా మన సంఘమున నేడు అనేక నూత్నసమస్యలు తలయెత్తినవి. ఈ సమస్య లన్నింటిని ప్రశాంతమానసముతో సమాలోచించి, సంఘ కళ్యాణమునకు అనుకూలించు పద్ధతులతో పరిష్కరించుకొనుట తగును గాని, చీటికి మాటికి మీరు మీ శాస్త్రములను వెదకి, అందలి శ్లోకముల నేర్చి కూర్చి "ఇవిగో మా శాస్త్రములు. మీ సమస్యలు గిమస్యలు పనికిరావు. మా శాస్త్రములే మాకు ప్రమాణ

ములు. ఇందలి ప్రత్యక్షరమును ఆచరణీయము. దీనికి వ్యతిరేక ముగా మీరు వర్తింతురా మేము సహింపము." అని పోరాడుట సంఘక్షేమమునకు మిక్కిలి హానికరము. ఈ శాస్త్రములను అనుసరించి వర్తించుట—ఇప్పటికి కాదుగదా, ఇక కొన్ని శతాబ్దములకైన అసాధ్యమనుటకు దృష్టాంతముగా నొక చిన్న కథను, మీ యనుమతితో నిచ్చుట బొందుపఱచుచు,—ఈ "శాస్త్రదాస్యము"నకు ఇంతటితో స్వస్తి చెప్పుచున్నాము.

## 60. కథ

అనగా అనగా ఒక సంస్కృత కళాశాల—ఆ కళాశాలకు ఒక ప్రధానోపాధ్యాయుడు—ఆయన శ్రుతిస్మృతి పురాణేతిహాసముల నాదినుండి తుదివఱకు వల్లెవేసిన యుద్దండపండితుడు-వైదికశిఖామణి. ఒకనాటిరాత్రి (కారణము మాకు తెలియదు) ఏమని ప్రతిజ్ఞచేసెననగా—"శ్రుతిస్మృతి పురాణాదులు విధించిన ప్రకారము రేపు ఉదయమునుండి నేను వర్తించుకొననిచో చండాలుడను" అని యొట్టు పెట్టుకొనెను. ఆ ప్రకారమే, మరునాటి యుదయమున నిదుర లేచి, దంతధావనాది కృత్యములు నిర్వర్తించుకొని, స్నానప్రకరణమునకు ప్రారంభించెను. పది చేదలు పోసికొని, పదునొకండవ చేదతో స్నానము ముగింపబోవుచుండగా, "అయ్యగారూ! పాకీదొడ్డి తలుపు తెరవండీ!" అనియొక చండాల కంఠస్వరము వినవచ్చెను. వెంటనే శాస్త్రిగారికి ఒకశ్లోకము జ్ఞాపకము వచ్చెను.

137. స్నానభోజనవేళాయామ్ జపహోమేషు పైతృకే
సంధ్యాదినిత్యకార్యేషు దేవపూజాసు సర్వదా—

138. చండాలా స్త్రివిధాః ప్రోక్తా స్తేషాం సంభాషణాదికమ్
శ్రుత్వా, కర్మ పరిత్యజ్య దృష్ట్వా తత్పున రాచరేత్;

159. అన్యథా దోష మాప్నోతి కర్మభ్రష్టోభిజాయతే
చండాలస్యైవ తు శ్రుత్వా కృత్వా దృష్ట్వా పరిత్యజేత్ —

[స్మృ. ర]

(దీని సారాంశ మేమనగా—స్నానభోజనాది వేళలయందు చండాలుని కంఠస్వరము వినబడునేని ఆ క్రియలను అంతటితో నాపి, మరల శుచిర్భూతుడై, మరల ఆచరింపవలెను.)—కాబట్టి, శాస్త్రిగారు ఆ స్నానము నంతటితో ఆపి, పదినిమేషములు విరామముగైకొని మరల స్నానమారంభించెను; ఇంకను ముగింపలేదు—ఇంతలో "పాతచెప్పులు కుట్టానండీ! పాతచెప్పులు!" అను మరియొక చండాల కంఠస్వరము వీధినుండి వినవచ్చెను. కాబట్టి ఆ స్నానమును అంతటిలో ఆపి, మరల పదినిమేషములు విరామముగైకొని, మరల స్నానమారంభించెను. ఇంతలో ఆ చెప్పులుకుట్టువాడు వీధిచివరకుపోయి, మరల అదే వీధి వెంబడి తిరిగివచ్చుచు, మరల కేకలు వేయ నారంభించెను. శాస్త్రిగారు నిట్టూర్పు విడిచి మరల పదినిమేషములాగి మరల స్నాన మారంభించెను. ఈసారి ఏ యాటంకమును తటస్థింపలేదు; కాబట్టి స్నానమును యథావిధిగా ముగించి, వీధివసారాచూరునకు ఆరగట్టబడియున్న మడిపంచెను అందుకొనుచుండగా, ఆ వీధిలో పోవుచున్న యొక మోటారును, ఆ మోటారులో నెచటికో వేంచేయుచున్న 'ప్రతివాది భయంకర—అపరబ్రహ్మావతార—ప్రాచీనధర్మ సంస్థాపన మహాచార్య' ఇత్యాది ప్రచండబిరుద ప్రకాండులైన శ్రీశ్రీశ్రీ యతీంద్ర, నిరోగానంద, నిత్యబ్రహ్మానందస్వామిజీ మహారాజ్ గారును దృష్టిపథమున బడుట సంభవించెను. వెంటనే శాస్త్రిగారికి ఇంకొక శ్లోకము జ్ఞాపకము వచ్చెను.

140. యానారూఢం యతిం దృష్ట్వా సచేల స్నాన మాచరేత్—

(చూడుడు 22 వ శీర్షిక.) కాబట్టి, మరల నిట్టూర్పు విడిచి బావియొద్దకుపోయి మరల స్నానముచేసి, జపమునకు ప్రారంభించెను. 'ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః' అనియుపాసించుచుండగా, "అయ్యగారూ! బట్టలు తెచ్చానండీ." అను చాకలివాని యాహ్వానము కర్ణగోచరమయ్యెను. వెంటనే శాస్త్రిగారికి వేరొక శ్లోకము జ్ఞాపకమువచ్చెను—

141. రజక శ్చర్మకారశ్చ నటో బురుడ ఏవచ—
ఏతేషాం దర్శనం స్పర్శనే సంభాషణ మతఃపరః-

142. స్నానభోజనవేళాయాం జపహోమేషు పైతృకే
స్వాధ్యాయసమయే చైవ ధ్యానే నెచ్ఛంతి సూరయః- [హేమా]

కాబట్టి శాస్త్రిగారు మరొక నిట్టూర్పు విడిచి లేచి, పద్ధ్రప్రకారము బట్ట లప్పగించుకొని' ఆ చాకిపిశాచిని సాగనంపి, మరల జపము సేయుటకు ముందు, మరల స్నానమొనర్పవలెనుగాన, మరల స్నానమొనర్చి, మరల జపమును (ఈసారి ఏ ఆటంకమును రాలేదు—కావున) ముగించి, భోజనప్రకరణోన్ముఖుడయ్యెను. ఇప్పటికి నాల్గుసారులు స్నానమును, రెండుసారులు జపమును సంభవించుటచే తొమ్మిదిగంటల ప్రొద్దు ఎక్కెను. తాను ప్రధానోపాధ్యాయు డగుటచేత అందరికన్న ముందుగా (అనగా 9½ గంటలకే) కళాశాలకు బోవలసియుండెను, కాననిక అరగంటయే అవకాశము. శాస్త్రిగారిభార్య (పదునారేండ్ల పాలఘాటుపడుచు— శాస్త్రిగారి మూడవపెండ్లి ముద్దరాలు), బిరబిర పీటవేసి విస్తరిపఱిచి వంటకములు వడ్డించెను శాస్త్రిగారు పీటపై కూర్చుండెను. ఇంతలో మరొకటి జ్ఞాపకము వచ్చెను—

143. భార్యాపనంతు దారిద్ర్యమ్—

(దార్వాసన మనగా కఱ్ఱతో చేయబడిన ఆసనము—పీట మొదలైనవి.) కాబట్టి లేచి ఆపీట నవలకు ద్రోసి నేలపై గూరుచుండెను. (అది గచ్చుచేసిననేల.) ఔపాసనము ప్రారంభింపబోవుచుండెను. ఇంతలో నింకొకటి జ్ఞాపకము వచ్చెను—

144. కృతభూమౌతు భుంజీత— [తై. ౫]

(అనగా—భూమిని గోమయాదులతో శుద్ధిచేసి భోజనము చేయవలెను.) కాబట్టి మరల లేచి, "పేడ తెచ్చి యలుకుము" అని గృహిణిని ఆజ్ఞాపించెను, గృహిణి పేడ తెచ్చెను—అలికెను. జాగు చేసిన, కళాశాలకు బోవుట ఆలస్యమగునుగాన, ఆ తడి బట్టలతో ఆ తడిపేడపై అట్లే కూర్చుండి ఔపాసనముగించి భోజనమున కారంభించెను. మొదటి కబళము నోటిదాపునకు ఇంకను రానేలేదు. అదే సమయమందు, ప్రక్కనున్న కోమటి గురునాథముగారి యింటినుండి వడ్లదంపుకు కర్ణగోచరమయ్యెను. వెంటనే శాస్త్రిగారికి మరొక శ్లోకము జ్ఞాపకమువచ్చెను.

145. కాహాళీబ్రమణాదీనామ్ ముసలోలూఖలస్యచ
ఏతేషాం నినదో యావత్ తావత్కాల మభోజనమ్ [స్మ్ర. ౪]

(అనగా—రోళ్లు రోకళ్లు డప్పులు మొదలైనవాని చప్పుడు వినబడునంత కాలము భోజనము సేయరాదు). కాబట్టి, ఈసారి పెద్ద నిట్టూర్పు విడిచి శాస్త్రిగారు పూర్తిగా లేచెను. ఆ వడ్లదంపుడు ఇంతలో ఆగునదికాదు. తొమ్మిదిపైన నిర్వది నిమేషము లయ్యెను. అందువలన, బిరబిర దుస్తులు ధరించి కళాశాలకుబోయి ఒంటిగంటవఱకు నధ్యాపకత్వ మొనరించి, మాధ్యాహ్నికవిరామ మగుటచే నొంటిగంట పదినిమేషములకు ఇంటికి వచ్చెను. ఆలకించెను—వడ్లదంపుడు లేదు. 'ధన్యోస్మి' అని యనుకొని తొందరగా స్నానమొనరించి జపము ముగించి

మరల భోజనమునకై కూర్చుండెను, అప్పటికి రెండుగంటలు సమీపించుచుండెను. రెండున్నర గంటలకు మరల కళాశాలకు పోవలసియుండెను. శాస్త్రిగారి వయస్సు ఏబదిరెండు— పెద్దవాడు— ప్రొద్దుటినుండియు ఆహారములేమి కడుపు నకనకలాడు చుండెను. కావున, త్వరితముగా నాపోసన పట్టి భోజనమునకు ఆరంభించెను. పాపము! మొదటి కబళమింకను నోటిదాపునకు రానేలేదు. ఇంతలో ప్రతిదినము రెండు గంటల వేళకు, పనివారిని పనిచేయుటకు బిల్చెడు, వీరిసెట్టిగారి వేరుసెనగకాయల ఫ్యాక్టరీ గొట్టముయొక్క గుంయ్‌గుంయ్ నినాదము, శాస్త్రిగారికి శ్రుతి గోచరమయ్యెను. వెంటనే ఒక శ్లోకముకూడ స్మృతి గోచరమయ్యెను.

146. తైలయంత్రేక్షుయంత్రాదేః శబ్దో యావత్ ప్రవర్తతే
తావత్కాలం న భోక్తవ్యమ్—

(చూడుడు—14వ శీర్షిక) ఏమి చేయవలెను? ఆ కబళము నట్టే పట్టుకొని, ఎప్పుడెప్పుడని దానికొఱకు ఉఱ్ఱూట లూఱుచున్న జిహ్వను చప్పరింపులతో సంబాళించుచు, ఒక్క నాల్గు నిమేషములు ఎదురుచూచెను వీరిసెట్టిగారు తమ ఫ్యాక్టరీశంఖమును ఇంకను పూరించుచునే యున్నారు. ఆ సెట్టిగారికి నేడేమి యావేశము పుట్టెనోగాని, ఐదు నిమేషములు ఒకటే బిగువున లోకమును తమ శంఖారావముచే భీభత్స మొనరించి, ఆరవ నిమేషమునందు తమ యకాండతాండవమునుండి విరమించిరి. ఏడవ నిమేషమునందు శాస్త్రిగారి ఓష్ఠకవాటములు తెఱచుకొనెను. వదనగహ్వరము వివరించుకొనెను. లోనున్న జిహ్వాసింహము, దంతము లనంబడు 'కటకటా' లను దాటి వేటకొఱకు ముందుకు లంఘించెను. శాస్త్రిగారి హస్తము, ఆకొన్న యా సింగమునకు

మొదటిపేటను అందించుచుండెను. ఇంతలో శివశివ !—ప్రక్క నున్న గురునాధముగారి యింట వడ్లదంపుడు మరల ప్రారంభ మయ్యెను. ఇకనేమున్నది ? అపుడు శాస్త్రిగారి హృదయము ఎంత క్షోభించెనో యూహించి వర్ణించు పని మరొక వ్యాస కర్తకు విడిచి, అనంతర కథను మాత్రము మనము చెప్పి కొందము. ఇక ఆరు నిమేషములే వ్యవధి—కావున శాస్త్రిగారు లేచి ఇనుమడించిన వేగముతో పోయి సకాలమునకు శాల జేరిరి, ఆ మధ్యాహ్నము మొదటిగంట తాను వ్యాకరణమును జెప్ప వలసియుండెను. అది 'శిరోమణి' తరగతి. పాణినీయ [40] మందలి 'ఇకోయణచి' సూత్రమును వివరించి చెప్పుచుండెను. ఇంతలో నొక విద్యార్థి లేచి "అయ్యా ! పాణిని ఏ కాలమువా డండీ !" అని ప్రశ్నించెను. ఆ విద్యార్థి శూద్రుడు. వెంటనే శాస్త్రిగారికి ఒకసంగతి జ్ఞాపము వచ్చి ఆలోచింపసాగెను—'ఈ పాణినీయము షడంగములలో నొకటి. దీనిని ఈ శూద్రులచేత అధ్యయనము చేయింప దగునా ?'—

147. యజమానోపజీవిచ శూద్రాధ్యాపక యాజకౌ

ఎతే బ్రాహ్మణచండాలాః దైవేపిత్ర్యేచ వర్జితాః— [ప-స్మృ]

కాన, బ్రాహ్మణునకు శూద్రాధ్యాపకత్వము స్మృతివిరుద్ధము. అందువలన 'ఈ కళాశాలనుండి ఈ శూద్ర విద్యార్థులైన పోవ లెను—లేక నేనైన పోవలెను. ఇది సర్కారువారి కళాశాల. కావున ఈ శూద్రులు పోవుమార్గము లేదు. నేనే పోవలసియుం డును. తప్పదు' అని నిశ్చయించుకొని ఆ క్షణమునందే రాజీ నామా పత్రము వ్రాసి, టపాకు బంపించి ఇంటికి వచ్చెను. రాత్రి యైనది. స్నానము జపము పూర్తియైనవి. మరల భోజనమునకై కూర్చుండెను. ఒక కబళమైనది రెండవకబళ మింకను నోట

బడనేలేదు— అంతలో వసారానైపునుండి "ఒరే! అన్నయ్యా! పొద్దుటినుంచీ అన్నం తినలేదమ! ఎందుకురా ఇవ్వాళ ఇలా భీష్మించావు?" అనుమాటలు వినబడెను. ఆమాటలు పలికినది శాస్త్రిగారి విధవాసోదరి. ప్రస్తుతము చెఱకు మూసియుండెను. వెంటనే శాస్త్రిగారికి ఒక శ్లోకము జ్ఞాపకము వచ్చెను—

148. చండాలపతితోదక్యా వాక్యమ్ యాపత్ శ్రూయతే తథా ।
భుక్త్వాతు గ్రాసమాత్రేణ దినశేషం అభోజనమ్— [స్మృ-ర]

(ఉదక్యా అనగా చెరగు మూసిన స్త్రీ. భోజనవేళ ఆమె మాట వినబడునేని ఆదినమంతయు నుపవసింపవలెను). ఇక నేమున్నది! ఒక దీర్ఘనిశ్వాసము విడిచి, శాస్త్రిగారు లేచి మంచముపై నొడలు చేర్చెను. దినమంతయు నుపవాసము. ఉద్యోగము నుండి తనకు ప్రవాసము. అయినను, 'శాస్త్రసమ్మతమైన రీతిగా ప్రవర్తించుచుంటిని గదా' అనెడివిశ్వాసము, ఆయన మనస్సునకు శాంతి కలిగించుచుండెను. ఇంతలో, పంచమినాడు (ఇక ఆరు దినములకు రానున్న) తన తండ్రిగారి యాబ్దికము జ్ఞాపకము వచ్చెను. ఈ యాబ్దికమునాడు గూడ ఈ దినమున సంభవించిన యాటంకములే మరల తటస్థించునెడల ప్రళయము సంభవింపక తప్పదు. కాబట్టి, పట్టణ నివాసమును విసర్జించి, ఏదేని యేకాంత స్థలమున ఇల్లు జూచుకొనుట శ్రేయస్కరము. ఈవిధముగా యోజించుకొనుచున్న సందర్భమున, శ్రాద్ధయోగ్యములగు భూములనుగూర్చి శాస్త్రములు చెప్పుచున్న శ్లోకములన్నియు ఆయనకు జ్ఞాపకము వచ్చెను. కొన్ని దేశములు శ్రాద్ధకర్మలకు పరిత్యాజ్యములు. ఏదేశములు? శాస్త్రిగారు యోజించెను. ఒక్క ఆర్యావర్తము తక్క ఇతర భారత ఖండమంతయు శ్రాద్ధకర్మకు అయోగ్యమని నిర్ణయించుకొనెను. (చూడుము. 25,

26 శ్రీక్షికలు). వెంటనే లేచి, భార్యను, మూడువేల రూప్యము
లను (మరొక మూడువేలు వడ్డీకి తిరుగుచున్నవి!) ముఖ్యముగా
కావలసిన సామగ్రిని, వెంటనిడుకొని ఆ రాత్రియే రైలెక్కి
మూడవనాటికి కాశీలో దిగెను. దిగినవెంటనే, పిడుగువంటి
శ్లోకమొకటి జ్ఞాపకమువచ్చెను.

149. న శూద్రరాజ్యే నివసేత్!
(చూడుడు, 27 వ శీర్షిక). మరి-కాశీ, బ్రిటిష్‌రాజ్యములోనిదే
గదా! ఏమిచేయవలెను? ఇక నొకటేమార్గము—ఏ పరరాజ్య
మునకైన పోవుటయే గత్యంతరము. కాబట్టి కాశీనుండి కరాచీ
ఓడరేవునకు వచ్చెను. అచ్చట మరొక స్మృతి శాసనము జ్ఞాప
కమువచ్చెను.

150 సముద్రయానగమనమ్ బ్రాహ్మణస్య న శాస్యతే—
ఇక కర్తవ్యమేమి? మరునాడే తండ్రిగారి యాబ్దికము. తెలవార
వచ్చుచున్నది. అట్టి విషమస్థితిలో — అట్టి ధర్మసంకటవ్యవ
స్థలో—శాస్త్రిగారికి దైవవశమున నొక వస్తువు కంటబడెను.
అది విమానము! (ఇంగ్లాండు హిందూదేశములమధ్య, టపా
మోయు విమానము కాబోలు!). అది సముద్రపుటొడ్డున
విశ్రాంతి గైకొనుచుండెను. ఇకనేమి! ఆ విమానమెక్కి తండ్రి
గారి యాబ్దికము నంతరిక్షరాజ్యములో బెట్టుటయే ఇకకర్తవ్యమని
నిర్ణయించుకొని, బిరబిర నిరువురు సద్బ్రాహ్మణుల బిలుచుకొని
వచ్చి, ఆ విమానాధికారులకు వేయి రూప్యములు ఇచ్చునట్లును,
మధ్యాహ్నము పదియురెండు గంటల వరకు అది యాకాశ
ములో తిరుగుచుండునట్లును బేరమాడి యెక్కెను. విమానము
రివ్వున నెగిరి మేఘమండల సంచారము సేయుచు, అరేబియా
సముద్రముపై అల్లనల్లన దూరాడుచుండెను. అపుడు—అపుడు—

శివశివ! ఏమి చెప్పుదుము! మొదలునరికిన మ్రానువలె శాస్త్రిగారు ఆ విమానమునందు కూలబడెను. కాగణమే మున—ప్రళయ మేఘ గర్జనలవలె భయంకరములైన మరికొన్ని స్మృతివాక్యము లాయనకు జ్ఞాపకమువచ్చెను—

151. నాంకస్థో దారుసంస్థో వా నాకాశే నాంధకారితే
అశ్నీయాత్— [స్మృ. ర]

152. నైకవాసే నచద్వీపే నాంతరిక్షే కదాచన శ్రుతిస్మృత్యుదితమ్
కార్యమ్ నకుర్యాదశుచిః క్వచిత్— [తైత్రిం]

కాబట్టి, అంతరిక్షముకూడ శ్రాద్ధ కర్మాచరణమునకు నిషిద్ధమని శాస్త్రములు ఏకగ్రీవముగ వాకొనుచున్నవి. ఇక నేమిచేయవలెను? శాస్త్రిగారికి వెఱ్ఱియెత్తెను. చివాలున లేచి విమాన గవాక్షమునుండి క్రిందికి తొంగిచూచెను. ఉత్తుంగ తరంగ మాలికా సహస్రములతో అరేబియా సముద్రము ఆయునకు దృష్టిగోచరమయ్యెను. "అరరే! శాస్త్రములందలి ప్రత్యక్షరమును పరిపాలింప బూనువారికి, కడకు అరేబియా సముద్రమే గతికాబోలు. కానిమ్ము! అరేబియా సముద్రములో దుమికియైన ఆత్మశాస్త్రములను పరిపాలించెదగాక!"—ఇట్లు నిశ్చయించుకొని ఆసముద్రములో దుముకుటకై నడుము బిగించుకొను చుండెను. ఇంతలో నేమి చెప్పుదును! అశని పాతమువంటి మరొక స్మృతి వాక్యము ఆయనకు స్ఫురించెను.

153. ఆత్మహననోద్యమేన బ్రాహ్మణత్వ మపగతమ్
చండాలత్వ మాపాతమ్— [ప. మా. వ్యాఖ్య]

కాబట్టి, ఆత్మహత్యవలన బ్రాహ్మణత్వము అంతరించుటయు చండాలత్వము ప్రాపించుటయు సంభవించును! ఏమున్నది! శాస్త్రిగారి మతము ఇక గిరుక్కున మరలెను. వారి బుద్ధి—

ఇంతవఱకు మత్తగజమువలె శాస్త్ర విచార మహారణ్యమందు విచ్చలవిడిగా సంచరించిన వారిబుద్ధి—ఇక హేతువిచారము అను కట్టుకంబమునకు వచ్చి చేరబడెను. "అరరే! శాస్త్రములందలి ప్రత్యక్షరమును అనుసరింప బూనుట నాదే బుద్ధి లోపము. పరస్పర విరుద్ధ ధర్మ ప్రతిపాదకములైన ఈ శాస్త్రములను ఇకనుండి గుడ్డితనముగా ననుసరింపకుందునుగాక! ఇకనుండి సర్వకార్యాచరణములందును నాబుద్ధియే నాకు శరణ్యమగుగాక! వేయునేల? ఇకనుండి నేను శాస్త్రములకొఱకుగాక, శాస్త్రములే నా కొఱకు జీవించుగాక!" ఇట్లు నిర్ణయించుకొని ఆ విమానమును మరల ఒడ్డుకు జేర్పించి దిగి అచ్చటనే పితృకార్యము నిర్వర్తించి, కొన్ని దినములకు మరల స్వస్థానము జేరి, సర్కారువారికి క్షమాపణ పత్రము వ్రాసి, క్షమింపబడి, ప్రధానోపాధ్యాయ పదవియందు మరల స్థాపితుడై యథాపూర్వముగ జీవయాత్ర నాచరించుచుండెను. ఇదియే కథ—

154. "అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

ఓం శాంతిః శాంతిః శాంతిః



# టీక

పు 4— 1 శ్రుతులు:—వేదములు వేదాంగములు ఆరణ్యకములు బ్రాహ్మణములు ఉపనిషత్తులు, వీనిని శ్రుతులను పేర వ్యవహరింతురు.

పు 4— 2 స్మృతులు:—మను పరాశర నారద యాజ్ఞవల్క్యాది మహర్షులచేత రచింపబడిన ధర్మశాస్త్రములకు స్మృతులని పేరు.

పు 4— 3 ఇతిహాసములు:—భారత రామాయణములు.

పు 4— 4 పురాణములు:—ఇవి పదునెనిమిది. మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన కల్కి బ్రహ్మ బ్రహ్మవైవర్త గారుడ లింగ అగ్ని స్కాంద వాయు పద్మ శివ విష్ణు భాగవత భవిష్యత్ పురాణములు.

పు 7— 5 కలౌ పారాశరాః స్మృతాః:—కలియుగములో పరాశరస్మృతియే ప్రమాణము.

పు 8— 6 అభోజనము:—ఉపవాసము.

పు 8— 7 కృచ్ఛ్రము:—మూడుదినములు ఉదయములందు మాత్రమే చప్పని యాహారమును, తదుపరి మూడు దినములు రాత్రులందు మాత్రమే చప్పని యాహారమును, తదుపరి మూడు దినములు (అయాచితముగా లభ్యమగునేని) మరల అట్టిదే యాహారమును, తదుపరి మూడు దినములు పూర్తి ఉపవాసమును— ఇది కృచ్ఛ్రమనబడు ఒక ప్రాయశ్చిత్తము.

పు 8— 8 చాంద్రాయణము:— నెమిలిగ్రుడ్డు ప్రమాణమును మించని పదునైదు ముద్దలతో పూర్ణిమనాడు భోజనము ప్రారంభించి, చంద్రుని కళలతోపాటు దినదిన ఒక్కొక ముద్దను తగ్గించుకొనుచు, అమావాస్యనాటికి

కబళమాత్రుడై, అదిమొదలు మరల క్రమముగా హెచ్చించుచు రెండవ పున్నమనాటికి ఆ పదునైదు ముద్దలతో ముగించుట— ఇది చాంద్రాయణ మనబడు ఒక ప్రాయశ్చిత్తము.

పు 8— 9 పరాకము:— పదియురెండు దినములు కఠినోపవాసము చేయుట పరాకమనబడు ప్రాయశ్చిత్తము.

పు 13— 10 ఉంఛవృత్తి :— వడ్లుదంచిన ఱోళ్లవద్ద పడియుండు గింజలను, ఏరికొని జీవించుటయని కొందఱి అభిప్రాయము.

పు 15— 11 త్రిషవణము:—దినదినముమూడుప్రొద్దులు ముమ్మారు స్నానము చేయుటకు త్రిషవణమని పేరు.

పు 16— 12 పంచగవ్యము:— ఆవుపాలు ఆవుపెరుగు ఆవునెయ్యి ఆవుమూత్రము ఆవుపేడ, ఈ అయిదింటిని సమభాగములుగా కలిపిచేసిన మిశ్రణమునకు పంచగవ్యమని పేరు.

పు 17— 13 వేదాంగములు :— శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము, ఈ యారింటికి వేదాంగములని పేరు.

పు 25— 14 తీర్థయాత్రాం వినాగత్వా:— తీర్థయాత్రకన్న ఇతరమైన కార్యములమీద పోయిన యెడల—

పు 25— 15 నేతి నేతి:—ఇదికాదు—ఇదికాదు—

పు 28— 16 త్రిశంకు స్వర్గము:—త్రిశంకుడను రాజుకొరకు, విశ్వామిత్రుడు తన తపోమహిమచే సృజించిన అపర స్వర్గము. అది భూమ్యాకాశముల నడుమ వ్రేలుచున్నదని గాథ.

పు 28— 17 పణములు :— పూర్వకాలపు రాగి నాణెములు.

పు 37— 18 అవర వర్ణములు:—బ్రాహ్మణేతర వర్ణములు.

పు 39— 19 జిజియా:—మహమ్మదీయ పాలకులు ఇతర మతస్థులపై విధించిన సాలీనా తలపన్ను. ఇది మూడు రకము లుగా నుండెను—రూ 30 లు, రూ 20 లు, రూ 10 లు.

పు 42— 20 సత్యంవద:—ఇత్యాది—సత్యము వచింపుము. ధర్మము నాచరింపుము. సత్యమునుండి చలింపవద్దు. ధర్మమునుండి చలింపవద్దు. ఇదే ఆజ్ఞ. ఇదేహితము.

పు 42— 21 యద్దృశ్యమ్ తన్నశ్యమ్:—కంటికి కనుపించునదియెల్ల మంటిలో కలియుట తప్పదు.

పు 42— 22 కలౌసంఘే శక్తి:—కలిలో సంఘీభావమే శక్తి.

పు 43— 23 త్వమేవాహం:—నీవే నేను.

పు 46— 24 గిన్నెలో పాయసము:—ఇత్యాది—విద్యాధికులని చెప్పదగిన పెక్కురు పెద్దలే ఇట్టి పచ్చియబద్ధము లాడుచున్నారు.

పు 46— 25 అహమ్ బ్రహ్మాస్మి:—నేనే బ్రహ్మను.

పు 47— 26 సంతబసివి:— సంతలలో విచ్చలవిడిగా తిరుగుచుండు ఆబోతు.

పు 50— 27 వ్యాస ప్రోక్తము:—వ్యాసమహర్షి నుడివిన మాట.

పు 56— 28 హరిశ్చంద్రుడు:—ఈ హరిశ్చంద్రుడే మన నేటి నాటకహరిశ్చంద్రుడు. కాని, అత్యంత ప్రాచీనమగు ఐతరేయ బ్రాహ్మణములోని కథ యెక్కడ! అర్వాచీనములును సంకర స్వరూపములును అగు పురాణముల ననుసరించి వ్రాయబడిన మన నాటకకథ యెక్కడ! మన ప్రాచీన వాఙ్మయములో విరివిగా చేయబడిన అపరసృష్టికి ఇది మరొక తార్కాణము.

పు 59— 29 అజీగర్తుడు:—ఆ యజ్ఞమునకు అజీగర్తుడు కూడ వచ్చియుండెను.

పు 61— 30 సత్యాన్నాస్తి పరోధర్మః:— సత్యమును మించిన ధర్మము లేదు.

పు 61— 1 అపుత్రస్య గతిర్నాస్తి:— సుతుడు లేని వానికి గతులు లేవు.

పు 61— 32 యథాకయాచ:—ఇత్యాది— ఏవిధముగా నైననుసరే ముందు అన్నసమృద్ధిని పొందుము.

పు 61— 33 ఆత్మవ త్సర్వభూతాని:— తనవంటివే ఇతర జీవములును.

పు 61— 34 శరీర మాద్యం:—ఇత్యాది—ధర్మాచరణము నకు శరీరము అవసరము. కాబట్టి ఆ శరీరమును కాపాడు కొనుట ప్రథమ కర్తవ్యము.

పు 61— 35 పితృదేవోభవ:— తండ్రి దైవము.

పు 70— 36 బుభుక్షితః:—ఇత్యాది— ఆకలిగొన్నవాడు ఏపని చేయడు?

పు 71— 37 జీవో జీవస్య:—ఇత్యాది— జీవికి జీవియే ఆహారము.

పు 71— 38 తత్త్వమసి:—(తత్ త్వమ్ అసి) అదే నీవు.

పు 7.— 39 ఏకమేవా౽ ద్వితీయమ్:— రెండు లేవు— ఒకటే.

పు 80— 40 పాణినీయము:—పాణిని మహర్షిచే రచింప బడిన శబ్దశాస్త్రము.



# శుద్ధపత్రం



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 11 | మొసర్చు | మొనర్చు |
| 5 | 16 | సందు | నందు |
| 6 | 1 | త్వాశ్యహిం | త్వాస్యహిం |
| 8 | 24 | సంద్య | సంధ్య |
| 9 | 19 | సతాం | సదాం |
| 13 | 18 | కొన్నను. | కొన్నను, |
| 13 | 22 | కొంచ మైన | కొంచెమైన |
| 18 | 9 | త్రహేణ | త్ర్యహేణ |
| 19 | 7 | పెక్కు | పెక్కురు |
| 21 | 9 | ఞోరణం | ఘోరణం |
| 23 | 7 | అస్పృస్య | అస్పృశ్య |
| 24 | 20 | స్యైకశతః | స్యైకశతమ్ |
| 32 | 16 | ధన | థన |
| 33 | 8 | యాలోచన | యాలోచన |
| 34 | 21 | ంష్టాపూర్తం | రిష్టాపూర్తం |
| 46 | 15 | అపస్మారము | అపస్మారములు |
| 48 | 15 | పంచే(ద్రియ | పంచేంద్రియ |
| 49 | 18 | నిర్భిన్న | నిర్భిన్న |
| 50 | 23 | న్యస్యతే | వ్యస్యతే |
| 51 | 8 | ఋషిపుత్రై | ఋషిపుత్రైః |
| 51 | 15 | శ్రియతే | క్రియతే |

| | | | |
|---|---|---|---|
| 51 | 19 | ద్వాపరేమ్య | ద్వాపరేష్య |
| 52 | 18 | సంవిద్యాన్యైవ | సంవిద్యాన్నైవ |
| 58 | 23 | వసిష్టుడు— | వసిష్ఠుడు |
| 60 | 24 | స ఘటనలు | సంఘటనలు |
| 61 | 2 | ఆకడ | ఆకట |
| 61 | 5 | ఎదురించుట | ఎదిరించుట |
| 61 | 15 | అపుత్రన్య | అపుత్రస్య |
| 61 | 20 | శ రరమాంద్య | శరీరమాంద్యం |
| 62 | 4 | అధర్మము | అధర్మము. |
| 63 | 11 | కిత్యర్థాత్ | రిత్యర్థాత్ |
| 64 | 17 | పూర్వ్వకము | పూర్వకము |
| 64 | 25 | ప్రవచసము | ప్రవచనము |
| 65 | 5 | లఘించు | లంఘించు |
| 65 | 8 | విడచి | విడిచి |
| 67 | 7 | శత్రవు | శత్రు |
| 74 | 4 | సూడ్చి | నూడ్చి |
| 74 | 12 | స్వా_త్ర్వీక | సా_త్ర్వీక |
| 78 | 7 | వలెను | వలెను |
| 78 | 10 | జౌపాసన | ఔపాసన |
| 78 | 15 | బ్రమణా | భ్రమణా |
| 79 | 4 | వెద్దవాడు | పెద్దవాడు |
| 80 | 17 | దై వే | దై వేచ |
| 80 | 22 | డును | దును |
| 83 | 7 | ధ్వాపే | ద్వాపే |